# యవ్వనంతో మేళవించే రంగు





మజా అంటే మజా.
స్కూల్లో మహా సరదా.
కొత్త ఫెవిక్రిల్ స్టూడెంట్స్
పోస్టర్ కలర్స్.
కళ్ళకి అనే చల్లని
ఛాయల అందం.
ఎంతో క్రీమీ క్రీమీ,
రంగు రంగుల మెరుపులు.





చిలకమ్మ గ్రీన్. ధమాకా రెడ్.
బలే బలే బ్లూ.
ఇక ఉండనే వుంది స్నోయీ వైట్!!
గబగబా వెయ్యండి డ్రాయింగ్.
చకచకా నింపండి కలర్స్.
కొత్త ఫెవిక్రిల్ స్టూడెంట్స్ పోస్టర్
కలర్స్‌తో మజాయే మజా,
ఉషారే ఉషారు!





(ష్ ష్! అమ్మ ఏమీ అనదులే! ధర చూసి
సరే నంటుంది. నువ్వేసిన బొమ్మ చూసి భలే అంటుంది!)

## ఉచితం
## పెయింట్-ఎ-పోస్టర్

ఈ కూపన్ ఈ చిరునామాకు వెంటనే పంపండి:
ఫెవిక్రిల్, పోస్ట్ బాక్స్ 17401 అంధేరి (ఈస్ట్),
బొంబాయి-400 059.

పిడిలైట్ ®

# ఫెవిక్రిల్
## స్టూడెంట్స్ పోస్టర్ కలర్స్




ఫెవికాల్ బ్రాండ్ ఎడ్హెసివ్‌లు తయారుచేయువారైన పిడిలైట్ వారి ఉత్పాదన.

everest/91/PIL/177

నాకు వెంటనే ఉచితంగా ఒక ఫెవిక్రిల్ పెయింట్-ఎ-పోస్టర్ సెట్ పంపండి.

పేరు ______________ వయస్సు ________

అడ్రసు ______________________

______________________________

స్కూలు ______________________

CDM




## తిండి సరిగ్గా తినకపోతే పెరుగుదల సరిగ్గా ఉండదు.

తిండి సరిగ్గా తినని పిల్లలకు, వారి దేహానికి అవసరమైన పోషణ లభించదు. తగినంత పోషణ లభించకపోతే పిల్లల పెరుగుదల కుంటుపడవచ్చు. ఈ పోషణ కొరతను పూరించడానికి వారికి ఇవ్వండి కాంప్లాన్. వారు కోల్పోయిన పోషణను భర్తీ చేయడానికి ఇది సహాయపడుతుంది. కాంప్లాన్‌లో వారి పెరుగుదలకు అత్యావశ్యక అత్యుత్తమ ప్రొటీన్ - పాల ప్రొటీన్ (20%) మరియు వారి దేహానికి కావలసిన 22 ఇతర ముఖ్యమైన ఆహార పదార్థాలు కలవు.

కాంప్లాన్ 5 చవులూరించే
రుచులలో దొరుకుతుంది.

**కాంప్లాన్®**

సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం




GX/27/173 TEL R

GO BONKERS!
WITH KWALITY BON BON



BON BON











Kwality
BON BON



విబిసి ఫుడ్స్ ప్రైవేట్ లిమిటెడ్

తాడిగడప – 521 137. విజయవాడ. ఫోన్లు: 58351 & 58352
C – 42, ఇండస్ట్రియల్ ఎస్టేట్, సనత్ నగర్, హైదరాబాదు – 500 018. ఫోన్లు: 263287 & 261733.



# శ్రద్ధాంజలి

భారత మాజీ ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధి, గత మే నెల 21వ తేదీన మద్రాసు సమీపంలోని శ్రీపెరుంబుదూరులో ఒక హంతకురాలి చేత ఘోరమరణం పాలవడం యావత్ భారతదేశాన్ని దిగ్భ్రాంతిలో ముంచింది. దేశం ఆ దిగ్భ్రమ నుంచి ఇప్పుడిప్పుడే కోలుకుంటున్నది.

వైమానికుడుగా తన జీవితాన్ని ప్రారంభించిన రాజీవ్‌గాంధి, రాజకీయ రంగంలో ప్రవేశించి—మొదట కాంగ్రెస్‌పార్టీ ప్రధాన కార్యదర్శిగానూ, ఆ తరవాత పార్లమెంటు సభ్యుడుగానూ, ప్రధానమంత్రిగానూ గురుతర బాధ్యతలు నిర్వహించాడు. ఆ పిమ్మట ప్రతిపక్ష నాయకుడుగా వుండి, ఎన్నికల ద్వారా మళ్ళీ తన పార్టీని విజయపథంవైపు నడిపించగలడని పలువురు భావించిన తరుణంలో దారుణమైన ఈ దుర్ఘటన జరిగిపోయింది!

రాజీవ్‌గాంధి అకస్మిక మరణానికి, అశేషపాఠకుల తరపున శ్రద్ధాంజలి ఘటిస్తూ, ఆయన కుటుంబానికి ప్రగాఢ సంతాపం తెలియజేస్తున్నాము.

—Editor






# నక్షత్రం గుర్తు

మనం బయలుదేరడానికి ముందు, మతి లేని వాసొవిచ్ రహస్యం ఎలా కనిపెట్టారో, న్యూ సిటీని ఎలా రక్షించారో చూద్దాం. UFOలోని వాచ్ విపుల్ తీసేశాడా? ఔను. అదే జరిగింది. భలే భలే స్నేహితులారా...

స్టేట్ మ్యూజియం నుంచి మోనార్క్ వజ్రాలు దొంగిలించబడ్డాయి. దొంగని పట్టుకోడానికి ఒకటే ఆధారం దొరికింది. నక్షత్రం గుర్తుగల జోడు జాడ. ఆ ఆధారంతోనే బాల గూఢచారులు మాస్టరికేవ్‌కి వెళ్ళగలిగారు....

రాల్ఫ్ ఇచ్చిన సలహా ప్రకారం బాల గూఢచారులు BSA SLR సైకిళ్ళ మీద అమిత వేగంగా మ్యూజియం దగ్గరకి చేరుకున్నారు. "వాచ్‌మన్‌తో ఒక్క మాట మాట్లాడుదాము" అన్నాడు విపుల్. అయితే ఆ బొండాము వాచ్‌మెన్ పెదవి విప్పలేదు. దొంగతనం జరిగిన చోట విపుల్ క్రింద పడి ఉన్న మ్యూజియమ్ ఉద్యోగులు ధరించే బ్యాడ్జ్‌ని తీశాడు. అరే వాచ్‌మన్ ఇటువంటి బ్యాడ్జ్ ఎందుకు పెట్టుకోలేదు? పూజ మరొకటి కనిపెట్టింది. వాచ్‌మెన్ ఎడమ పక్క మీనం క్రిందకి వాలిపోయి ఉంది. "అది దొంగ మీనం అయి ఉంటుంది" చెప్పాడు విపుల్.

### రిచ్‌మండ్ బీచ్

"చూడండి. నక్షత్రం గుర్తుగల జోడు జాడలు" ఆశ్చర్యంతో అరిచాడు విపుల్. రాల్ఫ్ తన BSA మీద పోలీసులని పిలుచుకు రావడానికి వేగంగా వెళ్ళాడు. మిగిలిన ఇద్దరూ ఆ జోడు జాడలని







పట్టుకుని మాన్స్టర్ కేవ్ దగ్గరకి చేరుకున్నారు.- అదుగో అదేమిటి? అదే నక్షత్రం గుర్తుగల జోడు! అదే ఇదేమిటి దొంగ మీనం. పూజ చేత్తో తీసింది.

గుహ దగ్గర

ఆ చీకటి గుహలో ఉన్నట్టుండి మాటలు వినిపించాయి. BSA SLR సైకిళ్ళ మీద వచ్చిన బాల గూఢచారులు ఎవరికీ కనిపించకుండా దాక్కున్నారు. "పడవ 15 నిమిషాలలో వస్తుంది." ఒకడు అరిచాడు. "బాదుషా కుష్ హెూగా" మరొకరు అన్నారు.

రాల్ఫ్, పోలీసులు వస్తున్నట్లే లేదు! విపుల్ వారి కోసం తన BSA SLR మీద వెళ్ళాడు. పూజ అక్కడే ఉండిపోయింది. కొద్దిసేపట్లోనే వారందరూ వచ్చారు. పూజ వారందరినీ రేవు దగ్గరకి తీసుకు వెళ్ళింది. కొద్దిసేపటి తర్వాత ఆ గ్యాంగ్‌ని పట్టుకున్నారు.




# గలజోడు రహస్యం

ఆ గ్యాంగ్‌లో ఒకరికి జోడుని, మీసాన్ని ఇస్తూ "మీ బాదుషా దగ్గరకి మమ్మల్ని తీసుకువెళ్ళండి" అని పూజ ఆజ్ఞాపించింది. "పని సులభంగా పూర్తవుతుంది" అంటూ

మ్యూజియం ఉద్యోగుల బ్యాడ్జి ఇచ్చేశాడు విపుల్. మరి బాదుషా ఎవరు? మ్యూజియం వాచ్‌మన్ అని వేరే చెప్పాలా!



మేము మీకు మరెన్నో అంతు చిక్కని రహస్యాలు చెప్తాము. దేవతల ద్వీపం రహస్యం, పక్షుల వేటగాళ్ళ రహస్యం. అలా మరెన్నో ఉన్నాయి. అంతవరకూ మీ BSA SLRల మీద రహస్యాలు కనిపెట్టూ ముందుకు సాగండి.





# వనిత

జన్మదిన సంచిక (జూలై '91) లో....

* మినీ నవలల పోటీలో రూ. 3000/- బహుమతి పొందిన

## 'ప్రేమ పరీక్ష'

ప్రారంభం!

* యద్దనపూడి సులోచనారాణి 'సెక్రటరీ'పై జలంధర విశ్లేషణాత్మక వ్యాసం

కొత్త శీర్షికలు :

* జీవనయాత్రా స్పెషల్ * ఆరోగ్య 'విజయా'లు
* శిరోజాలంకరణ (వర్ణ చిత్రాలలో) * మన శాసనసభలో వనితలు
* ఎవరు ఎక్కువ ఏళ్లు బ్రతుకుతారు? — విశేషరచన
* ఫెమినిస్ట్ ఉద్యమవాది ఓల్గాతో మాలతీచందూర్ 'సంభాషణం'
* సోనియా గాంధితో గోష్ఠి
* ఐదు కదలు

ఇంకా మీరు మెచ్చే అనేక శీర్షికలతో వెలువడింది.

విడిప్రతి : రూ. 5/- సం॥ర చందా రూ. 60.00

వివరాలకు :
విజయా బుక్ హౌస్
చందమామ బిల్డింగ్స్
వడపళని, మద్రాసు - 600 026.

A CHANDAMAMA PUBLICATION

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

## అడ్డదారులు వద్దు!

ఇటీవల ఒక జాతీయ దినపత్రికలో—రాజకీయ పార్టీల నాయకులు పరీక్ష రాస్తున్నట్టూ, వాళ్ళందరి సమాధాన పత్రాలలోనూ ఒకే మాట ఉన్నట్టూ, 'మాస్ కాపీయింగ్' అన్న శీర్షికతో ఒక వ్యంగ్యచిత్రం వెలువడింది!

కొన్ని నగరాలలో, కొందరు విద్యార్థులు మూకుమ్మడిగా కాపీ కొట్టడానికి పూనుకున్నారన్న వార్తలు వచ్చాయి. కాపీ కొట్టడం రకరకాలుగా సాగుతున్నది. కొందరు పుస్తకాలే చూసి రాస్తుంటే, మరికొందరు ముందుగానే రాసితెచ్చుకున్న కాగితం ముక్కలను చూసి రాస్తున్నారు. ఎలాచేసినా పరీక్షలలో నెగ్గడానికి ఇది సరైన మార్గం కాదు. ఇలా చేయడం, నిజాయితీగా కష్టపడి చదివే విద్యార్థులకు తీరని ద్రోహం చేసినట్టే అవుతుంది. పైగా తమ అసలు శక్తినీ, అర్హతనూ, అంచనా వేసుకునే అవకాశం ఉండదు. అర్హతకు మించి ఆశించడం అన్ని విధాలా అనర్థదాయకం అన్న సంగతి మరచిపోకూడదు.

విజయం సాధించడంకోసం అడ్డదారులు తొక్కడం ఒక్క విద్యారంగానికి మాత్రమే పరిమితంకాదు. ముఖ్యంగా క్రీడారంగంలోనూ ఇటీవల ఇది పరిపాటి అయింది. సుప్రసిద్ధులయిన క్రీడాకారులు కూడా కొందరు ఎలాగైనా విజయం సాధించాలన్న పేరాశతో, పోటీలలో పాల్గొనడానికి ముందు అమితశక్తిని పొందడానికి మాదక ద్రవ్యాలను పుచ్చుకున్న ఉదంతాలు బయటపడ్డాయి! ఎలాగైనాసరే గెలుపొంది తీరాలన్న దురాశకొద్దీ అడ్డదారులు తొక్కేవాళ్ళు, పట్టుబడిపోయి జీవితంలో ఓటమినీ, తీరని అవమానాన్నీ అనుభవించక తప్పదు!

సంపుటి 89 — జూలై '91 — సంచిక 1
విడి ప్రతి : 4-00 : : సంవత్సర చందా : 48-00






# చెరిగిపోతూన్న సరిహద్దు రేఖలు!

గత మార్చి నెలాఖరున చాలా ముఖ్యమైన సంఘటన ఒకటి జరిగింది. ఉత్తర ఆఫ్రికాలోని టొబ్రుక్ సమీపంలో ఈజిప్టు—లిబియా సరిహద్దులో గల ద్వారం వద్ద ఆ సంఘటన జరిగింది. లిబియా నాయకుడు కల్నల్ ముఅమర్ గడాఫీ ట్రాక్టర్‌తో సరిహద్దు ద్వారాన్ని పడగొట్టాడు. ఉభయదేశాల ప్రజల మధ్య గల అడ్డుగోడలను ఛేదించి, సత్సంబంధాలను పెంపొందింపజేయడానికే గడాఫీ ఆ పని చేశాడు!

ఒకే జాతి ప్రజల మధ్య ఏర్పడిన కృత్రిమమైన విభజన రేఖలు తొలగిపోయాయని ఈ చర్య చాటింది— అంటున్నాడు గడాఫీ. అరబ్ సమైక్యత అనే 'కల'ను నిజం చేయడానికి గడాఫీ ఎన్నో చర్యలు తీసుకున్నాడు.

ఈజిప్టు ప్రెసిడెంట్ గమాల్ అబ్దుల్ నాజర్ 'పాన్-అరబ్' జాతీయ సిద్ధాంతాలను గడాఫీ విశేషంగా అభిమానించాడు. 1969 వ సం॥లో శాంతియుత తిరుగుబాటు ద్వారా, బ్రిటిష్ సేనలను లిబియా నుంచి వెడలగొట్టుచేసి గడాఫీ అధికారం చేపట్టాడు. ఆనాటి నుంచే ఆయన సమైక్య అరబ్ దేశం గురించి కలలు గనసాగాడు. 1971 వ సం॥లో సిరియాను లిబియాతో కలిసిపొమ్మని చెప్పాడు. ఆ తరవాత ఆయన ఈజిప్టుతో ఐక్యం కావాలనుకున్నాడు. కాని, అంతలో అక్కడ అన్వర్ సాదత్ అధికారంలోకి వచ్చాడు. దాంతో ఐక్యత మాట అలా వుంచి, ఉభయదేశాల మధ్య సరిహద్దు తగాదాలు తలెత్తాయి. 1977 వ సం॥లో చిన్న యుద్ధం కూడా జరిగింది. పరస్పర ద్వేషం, వైరం 1981 వ సం॥లో హోస్ని ముబారక్ ప్రెసిడెంట్ అయిన తరవాత కూడా కొనసాగాయి.

అంతేకాదు. అరబ్-ఇజ్రాయెల్ యుద్ధానంతరం, 1979 వ సం॥లో ఈజిప్టు ప్రత్యేకంగా ఇజ్రాయెల్‌తో ఒక ఒప్పందం కుదుర్చుకున్నది. దాంతో కొన్ని అరబ్ దేశాలు ఆగ్రహం చెంది, ఈజిప్టుతో దౌత్యసంబంధాలను కూడా తెగతెంపులు చేసుకున్నాయి. అయినప్పటికీ, హోస్ని ముబారక్ అధికారంలోకి వచ్చిన తరవాత ఆయన చేసిన కృషి, చూపిన చొరవ ఫలితంగా అరబ్ దేశాలు ఒక్కొక్కటిగా మళ్లీ ఈజిప్టుతో సంబంధ

బాంధవ్యాలు పెంచుకోవడానికి అంగీకరించాయి. దాని పర్యవసానంగా, 1989వ సం॥లో మొరాకోలో జరిగిన అరబ్ సమావేశంలో ఈజిప్టుకు 'అరబ్ లీగ్'లో పునఃప్రవేశం లభించింది.

తదనంతరం గడాఫీ—ముబారక్‌ల మధ్య జరిగిన సమావేశం, చర్చల ఫలితంగా లిబియా, ఈజిప్టుల మధ్య మరింత సన్నిహిత సంబంధాలు ఏర్పడ్డాయి. 'వీసా' అవసరాన్ని తొలగించారు. ప్రయాణ నిబంధనలను సడలించారు. రైలు మార్గాలను కూడా కలుపుకున్నారు. అందువల్ల రెండు దేశాల మధ్య వాణిజ్య సంబంధాలు క్రమంగా బాగా అభివృద్ధి చెందాయి.

ఇవన్నీ జరిగిన తరవాత, 'ఒకే జాతి వారైన అరబ్ ప్రజలను ఈజిప్టు—లిబియా అని రెండుగా విభజించి సామ్రాజ్యవాదులు లేపిన కృత్రిమమైన సరిహద్దుద్వారాన్ని' పడగొట్టాలని గడాఫీ ఆశించాడు. బ్రిటిష్ సైనికులు లిబియాను వదిలిపెట్టిన 21వ వార్షికోత్సవ సందర్భంగా ఆ పని చేయాలని ముందుగానే తీర్మానించి, అలాగే నెరవేర్చాడు.

రెండు జర్మనీలను విడదీసిన బెర్లిన్ గోడ పడిపోయింది. ఇప్పుడు గడాఫీ తీసుకున్న ఈ 'అకర్షణీయమైన చర్య' కొన్ని దేశాల మధ్యగల మరికొన్ని కృత్రిమమైన సరిహద్దులు చెరిగిపోగలవనడానికి సూచన అని పరిశీలకులు భావిస్తున్నారు.



కల్నల్ గడాఫీ



# ఆత్మబంధువులు

కైలాసపురంలో వెంకటేశం, వరలక్ష్మి అనే దంపతులుండేవారు. వారికి ఆరేళ్ళ కొడుకు, నాలుగేళ్ళ కూతురు. వెంకటేశం తల్లిదండ్రులకు ఒక్కడే సంతానం కావడంతో, వాళ్ళు అతడి దగ్గిరే వుండేవారు. కొడుకు కచేరీలో మంచి ఉద్యోగంలో వున్నప్పటికీ, తండ్రి ఊరికే కూర్చోవడం ఇష్టంలేక, నలుగురు పిల్లలకు పాఠాలు చెప్పి, పెరట్లో కూరగాయలు పండించి, కొడుక్కు సాయపడుతూండేవాడు.

అయినప్పటికీ వరలక్ష్మికి, అత్తమామలు తమ దగ్గిర వుండడం ఏమాత్రం ఇష్టం లేదు. అయితే, అత్తమామల్ని వారి ఖర్మానికి వారిని వదిలేసి, తాము వేరే కాపరం పెడదామని ఆమె అన్నప్పుడల్లా, వెంకటేశం నిరాకరిస్తూ రాసాగాడు. దాంతో వరలక్ష్మి అవకాశందొరికినప్పుడల్లా అత్తమామలను, ఏవో సూటిపోటీమాటలు అంటూ తన కక్ష తీర్చుకోవడం ప్రారంభించింది.

ఇలా వుండగా, వరలక్ష్మి చిన్నచెల్లెలు గిరిజకు, కైలాసపురంలోనే వున్న చంద్రం అనే యువకుడితో వివాహం అయి, ఆమె కైలాసపురం వచ్చింది. చెల్లెల్ని చూడడానికి, వాళ్ళ ఇంటికి వెళ్ళిన వరలక్ష్మి, ఆ మనుషుల్ని చూసి తెల్లబోయింది.

నాలుగు గదులున్న చిన్న ఇంట్లో, గిరిజ, చంద్రం, అతడి తల్లిదండ్రులు, పెళ్ళీడు కొచ్చిన అతడి చెల్లెలు, ఎదిగిన తమ్ముడు వుంటున్నారు. వీళ్ళంతా కాక ఎప్పుడూ అనారోగ్యంగా వుండే చంద్రం నాయనమ్మ, ఒక మూల మంచంలో పడుకుని వున్నది. చంద్రం, అతడి తండ్రి సంపాదిస్తున్నదే వాళ్ళకు ఆధారం.

వరలక్ష్మిని చూసి గిరిజ అత్తగారు కామాక్షమ్మ సాదరంగా ఆహ్వానించి

లక్ష్మిగాయత్రి



కూర్చోబెట్టి, "మీ అత్తగారు మొన్న గుళ్ళో కనిపించి, నీ గురించి అంతా చెప్పిందమ్మా! అత్తమామలను ఇలా ఆదరంగా చూసే కోడలు దొరకడం వాళ్ళ అదృష్టం. మా చంద్రానికి ఎటువంటి పిల్ల దొరుకుతుందో అని, మేం అందరం బెంగపడేవాళ్ళం. నిన్ను గురించి వింటుంటే, నీ చెల్లెలు కూడా నీలాగే మమ్మల్ని ఆదరిస్తుందని నమ్మకం కలిగింది. గిరిజ కూడా నెమ్మదైన పిల్ల!" అంటూ మెచ్చుకున్నది.

"తేరగా కూర్చోబెట్టి పెడుతూంటే అదృష్టం కాదూమరి!" అని మనసులోనే పళ్ళు నూరుకున్న వరలక్ష్మి, వీలు చూసుకుని చెల్లెల్ని పెరట్లోకి లాక్కుపోయి, "ఏమిటే ఈ సంత! నువ్వు కలకాలం వీళ్ళను భరించవలసిందేనా?" అన్నది.

అక్క మాటలకు ఆశ్చర్యపడుతూ గిరిజ, "అదేమిటే, అక్కా?" అంటూ ఏదో చెప్పబోయింది.

కాని వరలక్ష్మి మధ్యలోనే ఆమెను కసురుతూ, "చాల్లే, తెలివి! పిల్లలు పుడితే ఎటూ నీకు కావలసినంత ఓపికా, డబ్బూ ఖర్చవుతాయి. అది చాలక ఈ అందరూ కూడానా? మరిదిగారికి చెప్పి హాయిగా మీ మానాన మీరుండండి. నీకు అటు చాకిరీ తప్పుతుంది, ఇటు మంచి చీరెలూ, నగలూ కళ్ళజూస్తావు," అన్నది.

గిరిజ ఈసారి అక్క మాటలకు ఏమీ బదులివ్వకుండా వూరుకున్నది. కాని, వరలక్ష్మి మాటలకు ఆమె మనసులో ఏవేవో ఆలోచనలూ, ఊహలూ రేకెత్తాయి.

కొద్దిరోజుల తర్వాత, వరలక్ష్మి అత్త శాంతమ్మ అనారోగ్యంతో మంచం పట్టింది. ఆ కారణంవల్ల, ఇంటి పనంతా ఒక్కతే చేసుకోవలసివచ్చి, కోపంతో రుసరుసలాడిపోతున్న వరలక్ష్మి, అన్నం పెట్టమని వచ్చిన భర్త మీద విరుచుకుపడుతూ, "నాకేం పది చేతులూ, పది కాళ్ళూ లేవు. అసలే ఆ రోగిష్టిమనిషికి సేవచెయ్యలేక చస్తున్నాను. మనం వేరే పోదామంటే విని

పించుకోవు. ఈ చాకిరీ అంతా చెయ్యలేక, ఎప్పుడో నేను హరీ అంటాను! అప్పుడు నీ కళ్ళు చల్లబడతాయి,'' అన్నది.

ఆ మాటలు విని వెంకటేశం కోపంతో, "వేరేపోదామో అని ఒకటేగోలచేస్తున్నావు. అందులో వుండే కష్టనష్టాలు, నీకు అనుభవంతో గాని తెలిసిరావు. కానీ, ఈవేళే వేరే ఇల్లు చూసి కాపరం పెట్టకపోతే, నా పేరు వెంకటేశమే కాదు!'' అంటూ విసురుగా వెళ్ళిపోయాడు.



వెంకటేశం చెప్పినట్టే వారం తిరక్కుండా, వేరే ఇల్లు చూసి, పెళ్ళాం పిల్లలతో కాపరం పెట్టాడు. అతడు చేరిన ఇల్లు మూడు వాటాలుగా కట్టినది. మధ్య వాటా వెంకటేశానిది. కుడివైపు వాటా ఇంటి యజమానురాలిది. ఎడమవైపు వాటాలో మరొక కుటుంబం అద్దెకుంటున్నది. వరలక్ష్మి ఎడమవైపు వాటాలో వుంటున్న సుందరితోనూ, ఇంటి యజమానురాలు మంగమ్మతోనూ స్నేహం చేసింది. వారం తిరక్కుండానే వారివారి కుటుంబ పరిస్థితులు అర్థం కాసాగాయి.

మంగమ్మ మహాగయ్యాళి మనిషి. ఆమె నోటిధాటికి తట్టుకోలేక, ఆమె భర్తే దాసోహమని బతుకుతున్నాడు. వాళ్ళకు ఇద్దరు కొడుకులు. వాళ్ళు సాక్షాత్తూ రావణ కుంభకర్ణులు. వాళ్ళ అల్లరిని ఊళ్ళో వాళ్ళంతా ఏవగించుకుంటారు. కాని, మంగమ్మ మాత్రం మెచ్చుకుని, వాళ్ళను ముద్దు చేస్తుంది.

ఇక సుందరికి ఇంచుమించు వరలక్ష్మి వయసే వుంటుంది. నోట్లో నాలుకలేని సుందరి, ఇంటెడుచాకిరీ ఒక్కతే చేస్తుంది. అయినా, ఆమెకు అత్తగారి సాధింపులూ తిట్లూ తప్పవు. మామగారు కూడా కోడల్ని సాధిస్తూనే వుంటాడు.

రెండు నెలలు గడిచాయి. వరలక్ష్మి కొడుకు రాము, నెమ్మదిగా మంగమ్మ కొడుకులతో స్నేహం మరిగి, బడి, చదువు ఎగ్గొట్టి అల్లరిచిల్లరగా తిరగసాగాడు. ఇన్నాళ్ళూ వాడి చదువంతా వరలక్ష్మి



మామగారు రామనాథం చూసుకునేవాడు. వాడు సాయంత్రాలు ఆటలకు వెళ్ళినా, పొద్దుపోయేసరికి ఇంటికి వచ్చేలా అయనే చూసేవాడు. అక్కణ్ణించి తాతా మనవ లిద్దరూ చదువుతూనే, కథలూ కబుర్లతోనే కాలక్షేపం చేసేవారు. ఇక్కడ రామూకు కాలక్షేపానికి ఎవరూ లేకపోవడం, వాడు దారితప్పడానికి కారణమైంది.

ఇంతలో ఒకనాడు, వీధిలో కూరలు బేరం చేసి లోపలికి వస్తున్న వరలక్ష్మికి, సుందరి భర్త, సుందరిని కొడుతూండడం, కంటబడింది. ఆమె గబగబా వెళ్ళి సుందరిని రెక్క పట్టుకుని ఇవతలికి లాగుతూ, ''ఆగండి! ఏమిటిది, ఎందుకిలా కొడుతున్నారు?'' అంటూ అరిచింది.

అక్కడే వుండి అంతా చూస్తున్న సుందరి అత్తగారు కోపంగా, "చాల్లేవమ్మా, చెప్పొచ్చావు! వాడి పెళ్ళాన్ని ఎందుకు కొడతాడో వాడిష్టం. నీ మొగుడిలా నా కొడుకు చవట దద్దమ్మకాదు,'' అన్నది.

ఆవిడ మాటలకు వరలక్ష్మి నిర్ఘాంత పోతూ, ''ఏమిటీ, ఏమన్నారు?'' అన్నది.

''పెళ్ళాం మాటలు విని, కన్నవాళ్ళను కాట్లో వదిలేసి వచ్చినవాడు, చవట దద్దమ్మ కాక మరేమిటి?'' అన్నదీ సుందరి అత్తగారు చేతులూపుతూ.

వరలక్ష్మి రోషంగా, ''మేమేమీ వాళ్లను కాట్లో వదిలిరాలేదు.'' అన్నది.

''వయసు మళ్ళినవాళ్ళకు, నా అనే తోడు లేకపోయాక, ఎక్కడున్నా కాట్లో వున్నట్టే!'' అన్నది సుందరి అత్తగారు.

ఆవిడ మాటలకు దుఃఖం పొంగివస్తూం డగా వరలక్ష్మి బలవంతంగా నిగ్రహించుకుంటూ, తన వాటాలోకి వెళ్ళిపోయింది.

ఇంతలో, గంటక్రితమే కచేరికి వెళ్ళిన వెంకటేశం, ఇంటికి తిరిగివచ్చి, వరలక్ష్మితో, "ఇదిగో, ఈ సంగతి విన్నావా? మా నాన్నకు నిధిదొరికిందట!'' అన్నాడు.

అంతవరకూ, సుందరి అత్తగారు అన్న మాటల గురించి బాధపడుతున్న వరలక్ష్మి అదంతా మరిచిపోయి, ఆతృతగా,

''నిధా! ఎక్కడ దొరికింది?'' అని భర్త నడిగింది.

''మా నాన్న పడుకునే పెద్ద పాత కాలపు పందిరిమంచం ఎరుగుదువుగదా. దాన్ని ఏ కీలుకాకీలు విప్పి ఎండలో వేద్దామని ఊడదీస్తుండగా, పట్టెమధ్యకు విరిగిపోయి, లోపలి నుంచి నవరత్నాలు బైటపడ్డాయిట!'' అన్నాడు వెంకటేశం.

''అయితే, ఇవాళతో మన దరిద్రం తీరిపోయిందన్నమాట! పదండి, త్వరగా మన ఇంటికి వెళదాం,'' అన్నది వరలక్ష్మి.

''మా నాన్నకు నిధి దొరికింది గనక, అది మనిల్లయిపోయిందా?'' అన్నాడు వెంకటేశం.

ఆ మాట వింటూనే వరలక్ష్మి వెలవెల పోయింది. ఆ సమయంలో అక్కడికి వచ్చిన ఆమె చెల్లెలు గిరిజ, ''అక్కా, నువ్వు చేసిన పనికి, అత్తామామయ్యలకు ఎలా మొహం చూపడం అని బాధపడు తున్నావా? మరేం బాధపడకు. కోడలు మంచి మనిషిగా మారి, మళ్ళీ తమ దగ్గిరకు వచ్చే రోజుకోసం, వాళ్ళు ఎదురు చూస్తున్నారు. ఇదంతా నేనూ, బావగారూ కలిసి ఆడుతున్న నాటకమని వాళ్ళకు తెలును!'' అన్నది.

''నాటకమా?'' అన్నది వరలక్ష్మి ఆశ్చర్యంగా.

''అవును! నీకు డబ్బుపై వున్న ఆశా, అయినవాళ్ళను చీదరించుకోవడం గమనించిననేను, బావగారితోమాట్లాడి, కొన్నాళ్ల పాటు మీరు వేరే ఇంట్లో వుండడానికి ఒప్పించాను. అందువల్ల మేలే జరిగింది. అన్నట్టు మామయ్యకు నిధి దొరకడం అదీ, వట్టిదే సుమా!'' అన్నది గిరిజ.

చెల్లెలు చెప్పినదానికి వరలక్ష్మి నవ్వి, ''పోనిద్దూ, నువ్వు పూనుకుని, ఎప్పటికీ తరగని జ్ఞాననిధి నాకిచ్చావు. ఇంకా ఆ రాళ్ళూ రప్పలకోసం ఆశపడతానా? ఆత్మబంధువుల ఆనందంకంటే, ఇవన్నీ ముఖ్యం కావని నాకు బాగా తెలిసి వచ్చింది. పదండి, ఇప్పుడే ఈ కొంప ఖాళీచేసి, మనింటికి వెళదాం,'' అన్నది.



# తోడుదొంగలు

ఒకానొక జమీందారు దివాణంలో, రాత్రివేళ దొంగతనం జరిగి, విలువైన ఆభరణాలు పోయాయి. మర్నాడు వాటిలో కొన్నిటిని పట్నంలో అమ్మజూపుతూ, భీమయ్య అనే నౌకరు దొరికిపోయాడు. ఎంతో బందోబస్తుగల, దివాణంలో దొంగతనం చేయడం ఒక్కడికి సాధ్యపడే పనికాదనీ, ఈ భీమయ్య అనేవాడికి మరెవరో తోడ్పడివుంటారనీ, జమీందారుకు అనుమానం కలిగింది. అయితే, ఎంత ప్రశ్నించినా, భయపెట్టినా భీమయ్య తోడుదొంగ లెవరో బయట పెట్టలేదు. వాణ్ణి చీకటికొట్లో పడేయమన్నాడు, జమీందారు.

ఆ సాయంత్రం దివాను, భీమయ్యదగ్గిరకుపోయి, "ఒరే, భీమయ్యా! నువ్వే నిజం ఒప్పుకుంటే, జమీందారుగారికి చెప్పి, నీ శిక్ష తగ్గించేలా చేయాలని అడుగుతున్నాను తప్ప, నీ తోడుదొంగలెవరో, నాకు తెలియకకాదు. ఈ దొంగతనానికి నువ్వేపథకం వేశావని, వాళ్ళంటున్నారు," అన్నాడు.

అది వింటూనే భీమయ్య కోపంగా, "పథకంవేసింది, నేనా! ఎవడలాచెప్పింది?" అన్నాడు.

"వాడేరావాడు! పేరు సమయానికి గుర్తురావడంలేదు," అన్నాడు దివాను.

"ఆ దివాణం ఊడ్చే వెంకయ్య అయుంటాడు!" అన్నాడు భీమయ్య పళ్ళుకొరుకుతూ.

"వాడిపేరదికాదు!" అన్నాడు దివాను.

"అయితే, కాపలా నౌకరు వెధవ పాపయ్య!" అంటూ కోపంగా అరిచాడు భీమయ్య.

"ఊహుం, వాడూకాదు!" అన్నాడు దివాను.

"అదేంమాట! దొంగతనం చేసింది మేం ముగ్గురమే అయితే, మరెవడో నన్ను గురించి మీకు చెప్పడం ఏమిటి? ఇదేదో బహు చిత్రంగా వుందే!" అన్నాడు భీమయ్య తలగోక్కుంటూ.

దానితో జమీందారు, భీమయ్యతోపాటు మిగిలిన ఇద్దరు దొంగల్నీ తగిన విధంగా శిక్షించాడు.

—బి. రఘురామరాజు






## 5

[సదానందముని సృష్టించిన అపూర్వుడనే విచిత్రవ్యక్తి, ముంటలపాలైన పేదల గుడిసెలను ఏనుగుల సహాయంతో రక్షించాడు. ఆ తరవాత సమీరుడనే కుర్రవాణ్ణి, బందిపోట్ల నుంచి కాపాడి, దొంగలను, సైనికులకు అప్పగించాడు. చేసిన పాపాలకు పశ్చాత్తాప పడి మంచి మార్గంలో పయనిస్తామని మాట ఇచ్చిన దొంగలను మరణశిక్ష నుంచి రక్షించాడు.—తరవాత]

"నాయనా, నీ కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వర్తించావు. చాలా సంతోషం," అని, తన దగ్గరికి వచ్చి నమస్కరించిన అపూర్వుణ్ణి ఆప్యాయంగా దీవించాడు సదానందముని.

"ఈ ప్రపంచంలో అడుగుపెట్టిన క్షణం నుంచి, ఒక సమస్య తరవాత మరొక సమస్యను పరిష్కరించడంతోనే కాలం గడిచిపోయింది. ఈ ప్రపంచాన్ని నింపాదిగా చూసి ఆనందించాలన్నది నా కోరిక," అన్నాడు అపూర్వుడు.

"తప్పక చూడు నాయనా! అయితే నువ్వు ఎక్కడికి వెళ్ళినా, అక్కడి పరిస్థితులు నిన్ను కార్యాచరణకు ప్రేరేపిస్తాయి. ప్రపంచం ఆనందనిలయంగా ఉండాలన్నదే భగవంతుడి సంకల్పం. కాని మానవులు తమ స్వార్థంకొద్దీ, దురాశకొద్దీ దీనిని శోకమయం చేస్తున్నారు. సంతో



షంగా ఉండాలంటే మంచి మనసు కావాలి. అది సిద్ధించేంతవరకు మనిషి తప్పులు చేస్తూ, దానికి తగ్గ బాధలు అనుభవిస్తూ గుణపాఠాలు నేర్చుకుంటూ ముందుకు సాగక తప్పదు. నాయనా, నువ్వు ప్రపంచాన్ని దర్శించడానికి వెళ్ళిరా. అయితే, చెడుమార్గంలో నడిచేవారిని మంచిమార్గంలోకి మళ్ళించడానికి ఏమాత్రం వెనకాడకూడదు. నిజానికి నువ్వు చెడును చూస్తూ ఊరుకోలేవు కూడా! అది నీ సహజగుణం! వెళ్ళిరా నాయనా," అన్నాడు సదానందముని.

అపూర్వుడు మునికి భక్తితో నమస్కరించి, మంచుకొండలపైనుంచి, మైదానాలలోకి పరిగెత్తాడు. వేగం పుంజుకోగానే అతడు అదృశ్యమైపోయాడు.

• • •

సాయంకాలమై చీకటి పడుతూన్న సమయంలో, దీపాలకాంతి అపూర్వుడి దృష్టిని ఆకర్షించింది. అది రత్నపురి రాజధానీ నగరం. విశాలమైన ప్రధాన వీధిలో ప్రజలు గుమిగూడి ఉన్నారు. అపూర్వుడు మెల్లగా వెళ్ళి జనం మధ్య నిలబడ్డాడు. అతణ్ణి ఎవరూ గమనించలేదు.

ఇద్దరు రాజభటులు దండోరా వేసి, "రత్నపురి ప్రజలకు ఒక ముఖ్యమైన ప్రకటన: రాజుగారి ఏకైక కుమార్తె మన యువరాణి కొంతకాలంగా వ్యాధిగ్రస్తురాలై వున్న సంగతి మీకు తెలుసు. రాజవైద్యులు ఎన్ని చికిత్సలు చేసినా వ్యాధి నయం కాలేదు. కాబట్టి యువరాణి వ్యాధి నయం చేసిన వారిని, వాళ్ళ ఎత్తు బంగారంతో సత్కరిస్తామని రాజుగారు తెలియజేస్తున్నారు!" అని చాటింపువేశారు.

ఆ చాటింపు విన్న ప్రజలు కొందరు తమలో తాము ఏవో మాట్లాడుకుంటూ, మరి కొందరు విషాద వదనాలతో మౌనంగా ఇళ్ళకు వెళ్ళిపోయారు. ఇద్దరు మాత్రం అక్కడే ఆగిపోయారు. అందరికీ విషాదం కలిగించిన ఆ వార్తను విని ఆ ఇద్దరు మాత్రం ఎంతో ఆనందంగా కనిపించారు.

"ఈ చాటింపు కోసమే నేనింతకాలం ఎదురుచూస్తున్నాను," అన్నాడు ఆ ఇద్దరిలో పొడవాటి వాడు నవ్వుతూ, తన మొన దేలిన గడ్డాన్ని మునివేళ్ళతో దువ్వుతూ. వాడు నల్లటి తలపాగా చుట్టుకున్నాడు. వాడి కళ్ళు త్రాచుపాము కళ్ళులాగా మెరుస్తున్నవి.

"స్వామీ, యువరాణి వ్యాధి నయం చేయడానికి వెళ్ళే ముందు పీకలవరకు భోజనంచేసి మరీ వెళ్ళండి. ఎంతఎక్కువ బరువుంటే అంత బంగారం మనదవుతుంది. ఏమంటారు? ఎలా వుంది మన ఆలోచన!" అన్నాడు పొట్టివాడు. వాడికి పెద్ద పెద్ద మీసాలున్నాయి.

"బ్రహ్మాండమైనఆలోచనే కుంభాండా! కాదనను. కాని, నీ గురువు, మహా మాంత్రికుడైన ఈ సర్పకేతుడు నీకన్నా తెలివైనవాడు! కేవలం బంగారంకోసమే నేనీ పథకం వేశాననుకుంటున్నావా?" అని అడిగాడు సర్పకేతుడు.

"దేనికోసం మరి?" అని అడిగాడు కుంభాండుడు.

"నీ గురువు, ఈ రాజ్యానికే గురువు కాబోతున్నాడు!" అన్నాడు సర్పకేతుడు.

"అంటే ప్రజలందరూ తమ శిష్యులయిపోతారన్న మాట!" అన్నాడు కుంభాండుడు.



"మూర్ఖుడా! నువ్వొక్కడివే నా శిష్యుడివి! కాని ఈ రాజ్య ప్రజలందరూ నా ప్రజలవుతారు. అంటే నాచేత పాలింపబడతారు. అర్థమయిందా?" అని అడిగాడు సర్పకేతుడు.

కుంభాండుడు అర్థం కాలేదన్నట్టు తల గోక్కున్నాడు.

"చెబుతాను విను. రాజుకు ఒక్కగానొక్క కూతురు మన యువరాణి, అవునా?" అని అడిగాడు సర్పకేతుడు.

"అవును, స్వామీ!" అన్నాడు కుంభాండుడు.

"రాజు నన్ను తన అల్లుడుగా స్వీకరిస్తానంటేనే నేను యువరాణి వ్యాధి నయం



చేస్తానంటాను. యువరాణిని పెళ్ళాడాక నేనే కదా రత్నపురి సింహాసనానికి వారసుణ్ణి!" అని పకపకా నవ్వసాగాడు సర్పకేతుడు.

"ఆహా! గొప్ప ఆలోచన!" అన్నాడు కుంభాండుడు అమితాశ్చర్యంతో.

"గొప్పవాళ్ళ నుంచి గొప్ప ఆలోచనలే వస్తాయి. ఇప్పుడు నా మాట జాగ్రత్తగా విను. రాజుతో నేను ఈ విషయంలో బేరమాడలేను. దానిని కూడా ఉపాయంతోనే సాధించుకోవాలి. నువ్వు వెళ్ళి రాజును దర్శించి, మానవుల బాధలకు పరిష్కారం సూచించే దివ్య వటవృక్షం ఒకటి అరణ్యంలో ఉందని చెప్పు. రేపు అర్ధరాత్రివేళకు రాజు అరణ్యానికి రావాలి. నేను చెబుతూన్న వటవృక్షం అరణ్యంలో ఎక్కడున్నదో నీకు తెలుసు కదా?" అని అడిగాడు సర్పకేతుడు.

"తెలుసు, స్వామీ! అరణ్యంలోని నదీ తీరంలో, ఒకవైపున పెద్ద పుట్ట, మరొకవైపున పాడుపడిన శిథిలాలయం మధ్య వున్న వటవృక్షమే కదా! తమరొకసారి ఆ వటవృక్ష బిలంలో దాక్కొని, ఒక వ్యాపారిని బెదరగొట్టారు కదా? ఆ వ్యాపారి హడలిపోయి, డబ్బు మూటను అక్కడే వదలి పారిపోయాడు కదా!" అన్నాడు కుంభాండుడు.

"సరిగ్గా జ్ఞాపకం వుంచుకున్నావు. ఆ వృక్షం ఎక్కడున్నదో రాజుకు స్పష్టంగా వివరించి చెప్పు. ఆ పిమ్మట నువ్వు రాజుకు ముందే బయలుదేరి వచ్చి, ఆయన అరణ్యానికి వచ్చేలోగా, వటవృక్ష బిలంలో దాక్కో. రాజు వచ్చి, వృక్షానికి నమస్కరించి, తన బాధ తెలియజేస్తాడు. అప్పుడు నువ్వు గంభీర కంఠస్వరంతో రాజుకు సలహా ఇవ్వాలి!" అన్నాడు సర్పకేతుడు.

"ఏమని సలహా ఇవ్వమని ఆజ్ఞ?" అని అడిగాడు కుంభాండుడు.

"దాపుల నున్న శిథిలాలయంలో ఒక పవిత్ర సాధువు నివసిస్తున్నాడు. నీ కుమార్తెను ఆ సాధువుకిచ్చి వివాహంచేస్తే

ఆమె వ్యాధి నయమవుతుంది. ఆ మహాపురుషుడే నీ కుమార్తె వ్యాధి పోగొడతాడు. వివాహం చేయించకపోయావో ఆమె మరణించక తప్పదు—అని చెప్పు. ఆ మాటలు నమ్మి రాజు, నాదగ్గిరికి వచ్చి నన్ను రాజధానికి తీసుకువెళతాడు. రాజభవనంలో నేను యువరాణిని పెళ్ళాడి ఆమె వ్యాధిని నయంచేస్తాను,'' అన్నాడు సర్పకేతుడు.

''ఉదయం తులసీదళాల రసం, సాయంకాలం బిల్వదళాల రసం సేవిస్తే యువరాణి వ్యాధి నయమైపోతుందనేకదా తమరు చెప్పారు. మరి నేను మీ శిష్యుడిగా వెళ్ళి ఆమాత్రం ఇవ్వలేనా? వ్యాధి నయమయ్యాక మీరు వచ్చి దర్జాగా యువరాణిని వివాహమాడవచ్చు కదా? దాంతో మన మిద్దరం కూడా రాజకుటుంబంతో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకోవచ్చు కదా?'' అన్నాడు కుంభాండుడు.

''మరీ అంతపెద్ద ఆశలు పెంచుకోకు శిష్యా! ఎలాగూ నేను రాజయ్యాక నిన్ను....,'' అని సర్పకేతుడు ఇంకేదో చెప్పబోయేంతలో, ''మంత్రిని చేస్తారు కదూ,'' అన్నాడు, కుంభాండుడు.

''కాదు, నిన్ను నా అంతరంగిక సలహాదారుగా చేసుకుంటానని ఎప్పుడో చెప్పాను కదా ?'' అన్నాడు సర్పకేతుడు.



కుంభాండుడు విచారంగా తల వంచుకున్నాడు.

''వెంటనే రాజభవనానికి వెళ్ళి, పని పూర్తిచేసుకుని రా! నేను శిథిలాలయంలో నీకోసం కాచుకుని వుంటాను!'' అంటూ అక్కడినుంచిబయలుదేరాడుసర్పకేతుడు.

వాళ్ళ మాటలు విని అపూర్వుడు ఆగ్రహం చెందాడు. సర్పకేతుడు మంత్రప్రభావంతో యువరాణిని అనారోగ్యం పాలు చేసి, ఇప్పుడు వ్యాధి కుదిర్చే సాకుతో, ఆమెను పెళ్ళాడి రాజ్యాధికారాన్ని చేపట్టాలని పథకం వేశాడు!

అపూర్వుడు సర్పకేతుణ్ణి వెంబడించి వెళ్ళాడు. వాళ్ళు చెప్పుకున్న అరణ్యమూ,



వటవృక్షమూ రత్నపురికి ఎంతో దూరంలో లేవు. మాంత్రికుడు శిథిలాలయంలో మానవ కపాలాలనూ, రకరకాల జంతు చర్మాలనూ, రంగురంగుల పొడులనూ, సేకరించి దాచి వుంచాడు. రాత్రి తొలిజాము గడిచిన తరవాత, కుంభాండుడు అక్కడికి వచ్చి, "స్వామీ మీరు అజ్ఞాపించిన విధంగానే రాజుగారికి చెప్పాను. రేపు అర్ధరాత్రికి, రాజుగారు ఒంటరిగా ఈ వృక్షం దగ్గరికి రాగలరు!" అన్నాడు.

"శభాష్, చాలా సంతోషం! చెట్టు తొర్రలో కూర్చుని రాజుగారిని ఏమని హెచ్చరించాలో జాగ్రత్తగా మననం చేసుకో. నేను చెప్పినదానికి ఒక్క మాట ఎక్కువగాని, తక్కువగాని ఉండకూడదు. జాగ్రత్త!" అన్నాడు సర్పకేతుడు.

కుంభాండుడు సరే అన్నట్టు తల ఊపాడు.

అమావాస్యరాత్రి ఆకాశం మేఘావృతమై ఉండడంతో అంధకారం అలముకున్నది. రాజు, అంగరక్షకులను దూరంగా వదిలి, ఆరణ్యంలోని వటవృక్షం కేసి ఒంటరిగా గుర్రం మీద వెళ్ళసాగాడు.

అపూర్వుడు అంతకుముందే పక్క చెట్టెక్కి కూర్చున్నాడు.

రాజు రావడానికి ఒక గంటసేపు ఉందనగా, సర్పకేతుడు, కుంభాండుడికి రాజు రాగానే ఏం చెయ్యాలో చెప్పాడు. కుంభాండుడు వటవృక్షం ఎక్కి దాని తొర్రలో దాక్కున్న తరవాత, సర్పకేతుడు శిథిలాలయం లోకి వెళ్ళిపోయాడు.

రాజు గుర్రం దిగి, వటవృక్షాన్ని సమీపించి, మోకాళ్ళపై కూర్చుని, భక్తితో నమస్కరించి, తన కుమార్తె వ్యాధి గురించి చెప్పి, "పవిత్రవృక్షమా! నా మీద కరుణించి, నా కుమార్తె వ్యాధి తీరే మార్గం చెప్పు," అని ప్రార్థించాడు.

"రాజా నిన్ను నేను కరుణిస్తున్నాను!" అన్నాడు చెట్టు తొర్రలో నుంచి కుంభాండుడు గంభీరంగా.

"ధన్యుణ్ణయ్యాను. నా బిడ్డ వ్యాధి నయమయ్యే మార్గం ఏమిటి తల్లీ?" అని అడిగాడు రాజు.

"పక్కనున్న శిథిలాలయానికి వెళ్ళు. అక్కడొక మాంత్రికుడు ఉన్నాడు. ఆ నీచుడే నీ కుమార్తె అనారోగ్యానికి కారణం. వాడు మంత్రోచ్చారణ చేయడానికి వీలుకాకుండా, మొదట వాడి నోటిని మూసి, శిరశ్ఛేదం చెయ్. దాంతో యువరాణి వ్యాధి సగం నయమై పోతుంది!"

కుంభాండుడి మాటలు విని అపూర్వుడు అమితాశ్చర్యం చెందాడు. దుర్మార్గుడైన మాంత్రికుడికి తగ్గ దుష్టుడైన శిష్యుడు! తన ద్రోహచర్యను బయటపెట్టే అవకాశం లేకుండా, సర్పకేతుడి నోరును మూయమన్న కుంభాండుడు నిజంగానే తెలివిగలవాడనిపించింది అపూర్వుడికి.

రాజు వృక్షానికి మూడవసారిగా నమస్కరించి, "దివ్యవృక్షమా, ధన్యవాదాలు! దయతలచి నా కుమార్తె మిగతా సగం వ్యాధి నయమయ్యే మార్గాన్ని కూడా సూచించు తల్లీ!" అన్నాడు రాజు.

కుంభాండుడు ఇప్పుడు ఏం చెబుతాడో అని అపూర్వుడు ఆసక్తిగా వినసాగాడు.

"రేపు తెల్లవారే సమయంలో ఒక యువకుడు మీ రాజభవన తూర్పుద్వార



సమీపంలో కనిపిస్తాడు. వాడు కొద్దిగా పొట్టివాడే గాని, పెద్దపెద్ద మీసాలుంటాయి. ఆ యువకుణ్ణి రాజభవనంలోకి ఆహ్వానించి, యువరాణికి చికిత్స చేయించు. ఆమె వ్యాధిని అతడు సులభంగా నయం చేస్తాడు. అయితే ఆమెకు సంపూర్ణ ఆరోగ్యం సమకూరాలంటే యోగ్యుడయిన ఆ యువకుడికే నీ కుమార్తెనిచ్చి వివాహం చేయాలి!"

"నా కుమార్తె ప్రాణాలు రక్షించుకోవడానికి నేనేమైనా చేస్తాను. ధన్యవాదాలు!" అన్నాడు రాజు మళ్ళీ నమస్కరిస్తూ.

"రాజా, ఆగండి. ఆ మాటలు నమ్మి మోసపోకండి!" అని హెచ్చరిస్తూ అపూ

ర్వుడు చెట్టుపై నుంచి కిందికి దూకాడు. రాజు దిగ్భ్రాంతితో చూస్తుండగానే, అపూర్వుడు రెండు చిన్న రాళ్ళు తీసుకుని రాపిడి కలిగించి, నిప్పురవ్వలు పుట్టించి, చితుకులు ఏరి మంటచేసి, దానిని చెట్టు తొర్రలోకి వేశాడు.

వెంటనే, "రక్షించండి,-రక్షించండి!" అని కేకలు వేస్తూ, కుంభాండుడు తొర్రలో నుంచి కిందికి దూకాడు.

"పట్టుకోండి, పెద్ద మీసాలు గల యోగ్యుడయిన ఆ యువకుణ్ణి!" అని ఆజ్ఞాపించాడు అపూర్వుడు.

కుంభాండుడు రాజు పాదాలపైబడ్డాడు.

అంతలో అలికిడి విని అక్కడికి వచ్చిన రాజుగారి అంగరక్షకులు కుంభాండుడి పెడరెక్కలు విరిచికట్టారు.

"శిథిలాలయంలో వున్న ఆ దొంగ సాధువును కూడా బంధించండి. వాడి నోరు మూయవలసిన అవసరం లేదు. గురుశిష్యులు కలిసి చేసిన నేరాలను ఒప్పుకోనివ్వండి!" అన్నాడు అపూర్వుడు.

"అంతా బాగున్నది. అయినా, నా కుమార్తె వ్యాధి నయమయ్యే మార్గం ఏమిటి మహాత్మా?" అని అడిగాడు రాజు.

"ఉదయం తులసీదళాలరసం, సాయంకాలం బిల్వదళాలరసం ఇవ్వండి. కొన్నాళ్ళలో ఆమె వ్యాధిపూర్తిగా నయమవుతుంది. ఇక వస్తాను!" అని చెప్పి అపూర్వుడు ఎటో వెళ్ళి పోయాడు.

రాజు, భటులతోపాటు శిథిలాలయం సమీపించాడు. అక్కడ సర్పకేతుడు ధ్యాననిష్ఠలో ఉన్నవాడిలా కళ్ళు మూసుకుని కూర్చుని ఉన్నాడు. భటులు వాణ్ణి పట్టి బంధించబోయారు.

"ఏమిటది? ఎవరు మీరు?" అని అరిచిన సర్పకేతుడు, ఎదుట చేతులు బంధించబడి వున్న కుంభాండుణ్ణి చూడగానే, తన పథకం ఎదురు తిరిగినట్టు గ్రహించి మౌనంగా తల దించుకున్నాడు. రాజభటులు వాణ్ణి బంధించి, శిథిలాలయం నుంచి బయటకు లాక్కు వచ్చారు.

—(ఇంకావుంది)





# అన్నదానం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఇంత అర్ధరాత్రివేళ, ఈ శ్మశానంలో ఇన్ని శ్రమలకోర్చుతున్నావంటే, ఏదో ఒక ముఖ్యమైన కార్యం సాధించదలచావని అర్థమౌతున్నది. అయితే, ఆ కార్యం నీ స్వార్థంకోసమో, పరోపకారంకోసమో తెలియడంలేదు. ఒకవేళ పరోపకారం కోసం అయితే, నువ్వు ముందుగానే తగినంత జాగ్రత్త వహించడం అవసరం. అలా కానప్పుడు రామన్న అనే వాడిలా నిందతోపాటు ప్రాణాపాయానికూడా గురికాగలవు. నీకు ముందు హెచ్చరికగా వాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



పూర్వం వరాహగిరి అనే గ్రామంలో, వినయభద్రుడనే పెద్ద వ్యాపారి వుండే వాడు. ఆయన ఎంతో తెలివితేటలతో బాగా కష్టించి, నిజాయితీగా వ్యాపారం చేసి చాలా ధనం కూడబెట్టాడు. అయితే, ఆయనను గురించిన వింత సంగతే మంటే—ఇంట్లో ఎంతో ధనం మూలుగు తున్నా, ధర్మగుణం, దైవభీతి గల వినయ భద్రుడికి ఏనాడూ దానధర్మాలు చేయా లన్న ఆలోచన కలగకపోవడం.

వినయభద్రుడి దగ్గిర ఎంతో కాలంగా పనిచేస్తున్న, రామన్న అనే విశ్వాసపాత్రు డైన నౌకరొకడుండేవాడు. వాడు ఒకనాడు యజమానికి కాళ్ళుపడుతూ, "అయ్యా, తమరు కోపగించుకోనంటే, ఒక మాట చెప్పాలనుకుంటున్నాను," అన్నాడు.

అందుకు వినయభద్రుడు చిన్నగా నవ్వి, "ఒరే, నువ్వు కోపగించుకోదగిన మాట అన్నప్పుడు, నేను కోపగించుకోక పోతే, నేను యజమానినీకాదు, నువ్వు నౌకరువూ కాదు. సరే, ఇంతకూ నువ్వు చెప్పదలిచిందేమిటి?" అని అడిగాడు.

రామన్న సంశయిస్తూనే, "అయ్యా, తమకు ఎంతో ఆస్తిపాస్తులున్నవి. నా అనేవారు లేరు. దానధర్మాలు చేసి ఇంత పుణ్యం ఎందుకు సంపాదించుకో కూడదు?" అన్నాడు.

నౌకరు మాటలు విని వినయభద్రుడు, ఒక క్షణం ఆశ్చర్యపోయి, "ఒరే, రామన్నా! నీ దగ్గిర డబ్బు లేదు కాబట్టి ఇలా మాట్లాడుతున్నావు. నిజంగానే నీకు డబ్బిస్తే, సొంతానికి దమ్మిడీ వాడుకో కుండా దానధర్మాలకు ఖర్చుపెట్టగలవా?" అని ప్రశ్నించాడు.

రామన్న తడుపుకోకుండా, "అయ్యా, ఖర్చుపెట్టగలను!" అన్నాడు.

"అలా అయితే ఒకపని చెయ్యి, నీకు నూరు వరహాలిస్తాను. ఆ ధనంతో ఎలాంటి ధర్మకార్యాలు చెయ్యగలవో చూడు. ఒక సంగతిమాత్రం గుర్తుంచుకో! ఇందులో నా పేరు ఎవరికీ తెలియకూడదు," అని

వినయభద్రుడు, రామన్నకు నూరు వరహా లిచ్చాడు.

అది వేసవికాలం. రామన్న, యజమాని యిచ్చిన ధనంతో, గ్రామంలోని ప్రధాన వీధిలో అక్కడక్కడా చలివేంద్రాలు కట్టించాడు. ఆ వీధి వెంట బోయే బాటసారులూ, గ్రామస్థులూ అక్కడ దొరికే చల్లని నీరు తాగి, రామన్న పరోపకార బుద్ధిని ఎంతగానో మెచ్చుకున్నారు.

తన నౌకరు నిజాయితీగా డబ్బు ఖర్చు పెట్టి, నలుగురికీ మేలు చేసిన వైనం వినయభద్రుడికి చాలా సంతోషం కలిగించింది.



కొన్నాళ్ళ తర్వాత ఒకనాడు రామన్న, వినయభద్రుడితో, "అయ్యా, నా దగ్గిర డబ్బు లేదుగానీ, ఉంటేనా — ఈ గ్రామంలో ఏకంగా ఒక ధర్మసత్రమే కట్టించేవాడిని!" అన్నాడు.

వినయభద్రుడు వాడి మాటలకు నవ్వి, "దానికయ్యే ఖర్చు నేనే భరిస్తాను. నా పేరు బయటికి రానీయకుండా, ఆ సత్రమేదో నువ్వే కట్టించు," అంటూ రామన్నకు పెద్ద మొత్తంలో ధనం ఇచ్చాడు.

రామన్న మూడు నెలలు గడిచేలోపల గ్రామంలో ఒక ధర్మసత్రం కట్టించాడు. ఆ సత్రంలో ఎక్కడా ఆశ్రయం దొరకని నిరుపేద ప్రజలే కాక, దూరప్రయాణాలు చేసేవాళ్ళు కూడా తలదాచుకో సాగారు. ఆ విధంగా ఆ సత్రానికి క్రమేణా రామన్నసత్రం అని పేరు వచ్చి స్థిరపడిపోయింది.

కొంతకాలం జరిగాక రామన్న ఒకనాడు, వినయభద్రుడితో, "అయ్యా, ఎంతోమంది జనం పట్టెడన్నం దొరకక్క మలమల మాడిపోతున్నారు. నా దగ్గిర డబ్బు లేదు గానీ, ఉంటేనా!" అంటూ ఆగిపోయాడు.

"ఉంటే ఏం చేసేవాడివిరా, రామన్నా?" అని అడిగాడు వినయభద్రుడు.



''నిత్యాన్నదానం చేద్దును!'' అన్నాడు రామన్న పెద్దగా నిట్టూర్చుతూ.

వినయభద్రుడు కొంచెం సేపు ఆలోచించి, ''డబ్బయితే నేనున్నంతకాలం సర్దగలను. కాని, అంత పెద్ద భారం నువ్వు మోయగలవా అన్న సందేహం కలుగుతున్నది,'' అన్నాడు.

''అయ్యా, ధర్మకార్యం భారం ఎలా అవుతుంది? పట్టుదలంటూ వుండాలే కాని, మనిషికి సాధ్యంకాని పనంటూ వుంటుందా!'' అన్నాడు రామన్న.

ఈ విధంగా వినయభద్రుడిస్తున్న ధనసాయంతో, రామన్న పేదలకు నిత్యాన్నదానం ప్రారంభించాడు. ఎక్కడెక్కడి నుంచో పేద జనం వచ్చి, కడుపునిండా తిని, ''రామన్న గొప్ప ధర్మప్రభువులు! వారు కలకాలం సుఖంగా వుండాలి,'' అంటూంటే, రామన్నకు ఎంతో తృప్తిగా వుండేది.

ఈ విధంగా కొన్నేళ్ళు గడిచాక, ఒకనాటి రాత్రివేళ వినయభద్రుడు హఠాత్తుగా చనిపోయాడు. ఆయనకు వారసులంటూ ఎవరూ లేకపోవడంతో, గుప్తదానాలు చేయగా మిగిలిన ఆయన ఆస్తి, రాజుగారి ఖజానా పాలయింది. యజమాని నుంచి వచ్చే ధనసాయం ఆగిపోవడంతో, రామన్న అన్నదానం చేయడం ఆపివేయవలసి వచ్చింది.

తన దగ్గిర ధనం అయిపోయిందనీ, ఇక అన్నదానం చేయలేననీ రామన్న చెప్పినప్పుడు, మొదట ఎవరూ అతడి మాటలు నమ్మలేదు. ఆ తరవాత అన్నార్తుల్లో కొందరు, అతణ్ణి హఠాత్తుగా పిసినిగొట్టువయ్యావని తిట్టారు; మరికొందరు కోపం పట్టలేక, అతడి మీద పడి కొట్టారు. ఆ దెబ్బలకు రామన్న అక్కడికక్కడే ప్రాణాలు వదిలాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, రామన్న దుర్మరణానికి కారకులెవరు? వినయభద్రుడా? అన్నార్తులా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక

పోయావో, నీ తల పగిలిపోతుంది.'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, 'వినయభద్రుడు, రామన్న కోరిన మీదట, తను బ్రతికున్నంతకాలం ధనం ఇచ్చాడు. ఆయన నిస్వార్థపరుడు. తను చేస్తున్న గుప్తదానం సంగతి, ఎవరికీ తెలియకూడదని, రామన్నను హెచ్చరించాడు కూడా. అంతేకాక, రామన్నకు వస్తున్న పేరు ప్రఖ్యాతులు చూసి, ఆయన ఏనాడూ అసూయపడలేదు. తన యజమాని ఇచ్చిన ధనాన్ని సద్వినియోగం చేయవలసిన బాధ్యత, రామన్నది. బ్రతకడానికి ఆహారం సంపాదించుకోవడం అనేది, ఎవడికి వాడు తేల్చుకోవలసిన సమస్య. ఏ తీర్థయాత్రికులకో, శరీరకష్టం చేసి ఆహారం సంపాయించుకోలేని వృద్ధులకో, వికలాంగులకో అన్నదానం చేయడం సమంజసమైనదే! అలా కాక, ఉచితంగా అన్నం దొరుకుతుందన్న ఆశకొద్దీ సోమరులైన వారికి, అన్నదానం చెయ్యడం అర్థం లేని పని. అలాంటి సోమరులకు వినయభద్రుడు ఇచ్చిన ధనంతో రామన్న వృత్తి విద్యలు నేర్పించడమో, లేక కాయకష్టం చేసే అలవాటు కలిగించడమో చేస్తే బావుండేది. అంతేగాక, నిరంతరం అన్నదానం చేయడం, దేశపాలకులైన రాజులకు కూడా సాధ్యపడదు. స్వతంత్రంగా ఇతరులను ఆదుకునే శక్తి లేనివాడు, ఇతరులు తన మీద ఆధారపడే దుస్థితిని దీర్ఘకాలంపాటు కొనసాగించరాదు. రామన్న ఈ పొరబాటు చేయడంవల్లనే, ఆకలిగొన్నవాళ్ళు అతడి మీద దౌర్జన్యానికి పూనుకున్నారు. ఇందుకు పరోక్షబాధ్యత, రామన్నది. ఈ కారణాలవల్ల, రామన్న చావుకు బాధ్యులు వినయభద్రుడూ కాదు, అన్నార్తులూ కాదు. అది రామన్న స్వయంకృతాపరాధం!'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం : డా॥ కాటిచెర్ల గురురామప్రసాద్ రచన]





# చేతికడియం

బంగారయ్య వడ్డీ వ్యాపారి. ఆయన నివసించే రావిపాలెం వాళ్ళేకాక, ఆ చుట్టు పక్కల గ్రామాలవాళ్ళు కూడా, అప్పు కోసం బంగారయ్య దగ్గిరకు వస్తూండే వాళ్ళు. నగలుగానీ, లేక ఏవైనా వస్తువులుగానీ తాకట్టు పెట్టుకుని, వాటి విలువనుబట్టి ఆయన అప్పులిస్తూండేవాడు.

బంగారయ్య దగ్గిరకు తరచుగా అప్పు కోసం వచ్చేవాళ్ళలో, వీరన్న ఒకడు. వీరన్న చాలా సామాన్యమైన రైతు. ఇంటి అవసరాలకూ, పొలం పనులకూ అతడు బంగారయ్య దగ్గిర అప్పు చేస్తూండేవాడు. అప్పుకు వచ్చినప్పుడల్లా, వీరన్న తన చేతికున్న బంగారు కడియాన్ని తాకట్టు పెట్టి, యాభై వరహాలు తీసుకుపోతూండేవాడు. డబ్బు రాగానే, ఆ యాభైవరహాలూ వడ్డీతో సహా బంగారయ్య కిచ్చి, తన కడియాన్ని తీసుకుపోతూండేవాడు.

ఒకసారి వీరన్న, బంగారయ్య దగ్గిరకు అప్పుకోసం వచ్చినప్పుడు, సమయానికక్కడ వీరేశం అనే బంగారు వస్తువులు చేసే అతనున్నాడు. వీరన్న తనకు యాభై వరహాలు అప్పు కావాలని చెప్పి, బంగారయ్యకు తన చేతి కడియాన్ని ఇచ్చాడు. బంగారయ్య డబ్బు లెక్క చూసి అతడి కిచ్చి పంపేశాడు.

వీరన్న చేతికడియాన్ని వీరేశం పరీక్షగా చూశాడు. ఆ చేతి కడియం చాలా నాసి రకం బంగారంతో చేసినది. పట్టుమని పదివరహాల విలువ కూడా చెయ్యదు!

ఎవరినీ ఒక పట్టాన నమ్మని బంగారయ్య, వీరన్న విషయంలో ఇంత పొరబాటెలా చేశాడని వీరేశం ఆలోచించ సాగాడు. వీరన్న ఇచ్చినది మంచి బంగారపు కడియం కాదని, బంగారయ్యకు చెప్పకుండా, తను వచ్చిన పని ముగించు

రాంబాబు



కుని, వీరేశం వెళ్ళిపోయాడు. అతడికి, బంగారయ్యకు నాణ్యత గురించి బొత్తిగా తెలియదన్న నమ్మకం కలిగింది.

ఆ తర్వాత నెల రోజులకు, వీరేశం నాసిరకం బంగారంతో నాలుగైదు రకాల వస్తువులు చేసి, వాటిని బంగారయ్య దగ్గరకు తీసుకుపోయి, "బంగారయ్య గారూ! మా చిన్నమ్మాయికి పెళ్ళి సంబంధాలు వస్తున్నవి. అదీకాక, నేను అద్దె దుకాణం వదిలి, సొంత దుకాణం కట్టించాలనుకుంటున్నాను. అందుకు, నాకు వెయ్యి వరహాల సొమ్ము కావాలి. ఈ బంగారునగలు తాకట్టుగా వుంచుకుని, నాకు సొమ్మివ్వండి," అన్నాడు.

బంగారయ్య, వీరేశం తెచ్చిన నగలను పరీక్షగా చూసి పెదవి విరిచి, "వీరేశం! నువ్వు బంగారం, వెండీ నగలు చేసే వృత్తిలో జీవిస్తున్నవాడివి. అటువంటి నీకు బంగారం గురించిన మంచి చెడ్డలు తెలియవనుకోమంటావా?" అని అడిగాడు.

వీరేశం, "మీరనేదేమిటో, నాకు తెలియడంలేదు," అన్నాడు.

ఆ మాటలకు బంగారయ్య చిన్నగా నవ్వి, "ఈ వస్తువులన్నీ నాసిరకం బంగారంతో చేసినవి. ఒకవేళ ఇటువంటి బంగారంతో, నీ చిన్నమ్మాయి నగలు చేసి అత్తవారింటికి పంపావో, గొడవలు రాగలవు. సరే, ఈ వస్తువులు తాకట్టు పెట్టుకునేందుకు, నా కభ్యంతరం ఏమీ లేదు. అయితే, వీటికి నీకు ఐదువందల వరహాలకన్న ఎక్కువ ఇవ్వను," అన్నాడు.

వీరేశం ముఖం చిన్నబుచ్చుకుని, "ఒకే గ్రామంవాణ్ణి. మిమ్మల్ని మోసపుచ్చ చూస్తున్నానని ఎందుకనుకుంటున్నారు? ఒంటరివాణ్ణి కాదు; పిల్లలు గలవాణ్ణి. గ్రామం వదిలి పారిపోలేను గదా! నాసిరకం బంగారం అంటున్నారు, బావుంది. మీరు ఇదే రకం బంగారంతో చేసిన వీరన్న చేతికడియానికి యాభైవరహాలిస్తున్నారు. నా సంగతి వచ్చేసరికి, నాసిరకం బంగారం అంటున్నారు," అన్నాడు.

బంగారయ్య ఒకటి, రెండు క్షణాలు తలాడిస్తూ వూరుకుని, తర్వాత, ''నువ్వు చాలా గట్టివాడివయ్యా, వీరేశం! వీరన్న నాకు చేతికడియం తాకట్టు పెడుతూండగా, సమయానికి ఆ రోజున వచ్చావు. ఆ కడియాన్ని పరీక్షగా చూశావన్నమాట అవునా ?'' అని అడిగాడు.

వీరేశం అవునన్నట్టు తలాడించాడు.

బంగారయ్య చిన్నగా చిటిక వేసి, ''వీరన్న చేతికున్న బంగారుకడియం, మంచి బంగారంతో చేసినది కాదని, నాకు మొదటి నుంచీ తెలును,'' అన్నాడు.

''మరి, తెలిసీ దాన్ని తాకట్టుపెట్టుకుని అంత మొత్తం అప్పుగా ఎలా ఇస్తున్నారు ?'' అని అడిగాడు వీరేశం.

''వీరన్న విషయంలో నేను మనిషిని నమ్మాను, అతడి వస్తువును కాదు. అతడు చాలా నిజాయితీపరుడు. బాల్యంలో కలిసి కట్టుగా తిరిగినవాళ్ళం. అతడి విషయంలో నేను, ఏ తాకట్టు లేకుండా అప్పు ఇవ్వదలిచాను, అయినా అతను ఒప్పుకోలేదు. ఆ కడియాన్ని తాకట్టుపెట్టి గాని, నా నుంచి డబ్బు తీసుకోడు,'' అన్నాడు బంగారయ్య.

ఆ జవాబుతో వీరేశం కాస్త తేరుకుని, ''స్నేహితుడంటున్నారు—అలాంటప్పుడు మీరు, వీరన్నకు అది నాసిరకం బంగారంతో చేసిన కడియం అని చెప్పక పోయారా ?'' అన్నాడు.

''అందువల్ల జరిగే మేలేమిటి ? ఆ కడియం ఇరవైవరహాల విలువ కూడా చేయదని, నాకు తెలును. కాని ఆ మాట వీరన్నతో అంటే, ఇక తర్వాత ఎంత అవసరం కలిగినా, నా దగ్గిరకు అప్పుకు రాడు. ఎవడో మోసబుద్ధి అతడి దగ్గిర వందవరహాలు తీసుకుని, ఆ కడియం అంటగట్టాడు,'' అన్నాడు బంగారయ్య.

బంగారయ్యలో వీరన్నపట్ల వున్న అభిమానానికి ఆశ్చర్యపోయి, వీరేశం తను చేసిన పనికి సిగ్గుపడుతూ, తను తెచ్చిన నాసిరకం బంగారునగలు తీసుకుని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.



## మహనీయులు కలలుగన్న భారతదేశం:

# మేలుకొలుపు!

నేతాజీగా ప్రజల మన్ననలనందుకున్న సుభాస్ చంద్రబోస్ 1897 వ సం॥ జూలైలో జన్మించాడు. 1920 వ సం॥లో లండన్‌లో ఐ. సి. యస్. పరీక్షలో ఉత్తీర్ణుడయినప్పటికీ, ప్రభుత్వ ఉద్యోగం చేపట్టకుండా భారత జాతీయ కాంగ్రెస్‌లో చేరాడు. తీవ్ర జాతీయ భావాల కారణంగా బ్రిటిష్ ప్రభుత్వం నేతాజీని గృహ నిర్బంధంలో ఉంచింది. అయినా, ఆయన 1941 వ సం॥లో కాబూల్‌కు తప్పించుకుని పోయి, అక్కడి నుంచి జర్మనీ చేరుకున్నాడు. మలయా ద్వీపకల్పంలో 'ఆజాద్ హింద్ ఫౌజ్' అనే ఉద్యమాన్ని నడిపాడు. ఆయన మన యువతకు ఇలా పిలుపు నిచ్చాడు.

"దేశసేవను పవిత్ర కర్తవ్యంగా భావించి యువతీయువకులు ముందుకు రావాలి. దేశమాత పిలుపు వినిపించడం లేదా? ఇంకా నిద్రమత్తులో జాప్యం చేయడం తగదు. వెంటనే లేచి కార్యగంగంలోకి ఉరకండి. పద్దెనిమిదవ శతాబ్దంలో మన తాతలు, విదేశీ వ్యాపారులను మన దేశంలోకి అనుమతించిన పాపాన్ని మనం ఈ శతాబ్దంలో ప్రక్షాళనం చేయాలి. మేల్కాంచిన భారతీయఆత్మ అభ్యుదయం కోసం పిలుస్తున్నది. భారతీయులందరూ తోబుట్టువులలాగా దేశస్వాతంత్ర్యం కోసం పోరాడాలి. గతవైభవాన్ని, ఘనకీర్తిని మళ్ళీ తీసుకు రావాలి!"

## మీకు తెలుసా?

1. 'మెట్రిక్' పద్ధతిని మొట్టమొదట అనుసరించిన దేశం ఏది?
2. అలెగ్జాండర్ చక్రవర్తి బాల్యంలో ఆయనకు ఒక గుర్రం ఇచ్చారు. దాని పేరేమిటో మీకు తెలుసా?
3. 'జూడో' అని పేరు గాంచిన ఆత్మరక్షణ పద్ధతిని రూపొందించిన వారెవరు? ఎప్పుడు?
4. 'ఆరోగ్యస్టాంపులు' వెలువరించే దేశం ఏది? వాటి ప్రత్యేకత ఏమిటి? (36 వ పేజీ చూడండి)



# శ్రీరామచంద్రుడు

మహావిష్ణువు భూలోకంలో శ్రీ రామచంద్రుడుగా అవతరించి రావణుణ్ణి సంహరించిన రామాయణగాథ జగత్ప్రసిద్ధమైనదే. ఆదికవి వాల్మీకి మహాముని రామాయణ కావ్యంలో రాముడి దివ్య చరితాన్ని వివరించాడు.

మహావిష్ణువు ఎత్తిన ఏడవ అవతారం శ్రీ రామావతారం. శ్రీరాముడు అన్ని విధాలా ఆదర్శవంతమైన జీవితాన్ని గడిపి, తరతరాల భారతీయులకు మార్గదర్శకుడయ్యాడు. బాల్యంనుంచే పెద్దల పట్ల గౌరవమర్యాదలు చూపాడు. బాల్యంలోనే రక్కసులను దునుమాడి మునుల బాధలు పోగొట్టాడు. తండ్రిమాట జవదాటకుండా, రాజ్యాన్ని త్యజించి, అడవులకు వెళ్ళి, పిల్లలు, కన్నతండ్రిపట్ల చూపవలసిన గౌరవాన్ని ఆచరణలో చూపాడు. అన్నదమ్ముల ఐకమత్యానికి రామలక్ష్మణుల అన్యోన్యత; భార్యాభర్తల అనురాగానికి సీతారాముల దాంపత్యం

ఈనాటికీ ఆదర్శంగా ఉంటున్నది. వానరసేన సాయంతో, బలాఢ్యుడైన లంకాధిపతి రావణాసురుణ్ణి సంహరించిన యోధుడు శ్రీరాముడు!

ప్రజలపట్ల రాజుగా రాముడు చూపిన అభిమానం, ప్రజాభిప్రాయానికి ఆయన ఇచ్చిన విలువ అనన్య సామాన్యమైనవి! అందుకే—శ్రీరాముడు, సీతాలక్ష్మణ హనుమత్సమేతంగా, ఆసేతుహిమాచల పర్యంతం గల భారత దేశమంతటా ఈనాటికీ ఆరాధ్యదైవంగా వెలుగొందుతున్నాడు!

# చందమామ కబుర్లు

## వేగంగా వాలుతూన్న గోపురం!

ప్రపంచ ప్రసిద్ధిగాంచిన పైసాగోపురం మామూలుకన్నా కాస్త వేగంగా వాలుతున్నదని—ఆ గోపురం అడుగు భాగం నుంచి, శిఖరం వరకు గల కొలతలను పరిశీలిస్తున్న ఇద్దరు అధ్యాపకులు అభిప్రాయ పడుతున్నారు. 1918 వ సం॥ నుంచి సంవత్సరానికి సగటున 1.01 మి॥మీ॥ ప్రకారం ఈ గోపురం వాలుతూన్నట్లు రికార్డయింది. అయితే 1991 వ సం॥ మొదటి మూడు నెలలలోనే ఈ గోపురం 1.1 మి॥మీ॥ వాలినట్లు ఈ పరిశీలకులు చెబుతున్నారు. ఈ గోపురం ఇంతవరకు 4 మీటర్లు అంటే 12 అడుగులకన్నా ఎక్కువే, వాలినట్లు రికార్డయింది।





## పుట్టినరోజు కానుక!

ద్రవస్ఫటికాలను (లిక్విడ్ క్రిస్టల్స్) గురించి విస్తృతంగా పరిశోధనలు జరిపి ప్రపంచ దృష్టిని ఆకర్షించిన సుప్రసిద్ధ శాస్త్రవేత్త డా॥ ఎస్. చంద్రశేఖర్‌కు ఈ జూన్‌తో అరవైయేళ్ళు నిండాయి. ఆయన జన్మదిన సందర్భంగా అమెరికాలోని జగత్ ప్రసిద్ధమైన 'మాసాచుట్స్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ' ఆధ్వర్యంలో ఒక సదస్సు ఏర్పాటుచేశారు. ఈ సదస్సులో ప్రపంచం నలుమూలల నుంచి దాదాపు వందమందికి పైగా ప్రముఖ శాస్త్రవేత్తలు పాల్గొన్నారు।

# సాహిత్యావలోకనం

1. మనుషులకు లాగానే తెలివితేటలూ, ధైర్యమూ గల ఒక వింత జాతి గుర్రాలు సుప్రసిద్ధమైన ఒక ఇంగ్లీషు పుస్తకంలో వస్తాయి. ఆ పుస్తకం ఏది ?
2. జపానులో అతి ప్రాచీనమైన గ్రంథం ఏది ?
3. వైమానికుడుగా వుండి, రచయితగా మారిన ఒకాయన ఒక గొప్ప పుస్తకం రాశాడు. ఆ రచయిత ఎవరు. ఆ పుస్తకం పేరేమిటి ?
4. సుప్రసిద్ధులయిన ఇద్దరు ఆంగ్ల కవులు ఒకే సంవత్సరంలో జన్మించారు. వారెవరు ? ఏ సంవత్సరంలో జన్మించారు ?
5. టాగూర్ 'గీతాంజలి' 1913 వ సం॥లో ఇంగ్లాండులో ప్రచురింపబడింది. దానికి తొలిపలుకు రాసినవారెవరు ?

## సమాధానాలు

మీకు తెలుసా ?

1. ఫ్రాన్స్
2. బూన్‌ఫంన్
3. డా॥ జిగోరో కానో, 1882 లో.
4. న్యూజిలాండ్. వాటి విలువకన్నా ఎక్కువ ఖరీదుకు అమ్మి, అలా వసూలయిన ధనాన్ని, పేదలకూ, పిల్లలకూ వైద్యం చేసే సేవాసంస్థలకు పంపుతారు.

సాహిత్యం

1. 'గలివర్స్ ట్రావెల్స్'
2. కోజికి. పురాణకాలం నుంచి క్రీ॥ శ॥ 600 సం॥ వరకు సాగిన జపాను చరిత్రను వివరిస్తుంది.
3. ఆంటొయిన్ డి సెంట్-ఎక్సూపెరీ; 'విండ్, శాండ్ అండ్ స్టార్స్'
4. లార్డ్ టెన్నిసన్, ఎడ్గర్ అలన్ పో; 1809 వ సం॥లో
5. డబ్ల్యు. బి. ఈట్స్.



ప్రపంచ పురాణగాథలు - 7

## రెండువృక్షాల రహస్యం!

ఒక లోయలో అందమైన గ్రామం ఉండేది. ఆ గ్రామం వున్న ప్రాంతంలో ఒకప్పుడు పెద్ద తటాకం ఉండేది. తటాకం ఎండిపోవడం వల్ల, క్రమేణా అక్కడ గ్రామం ఏర్పడింది. ఆ గ్రామ ప్రజలకు పాడిపంటలు సమృద్ధిగా లభించేవి.

ఫిలేమాన్ అనే వృద్ధుడు, ఆ గ్రామం చివర తన భార్య బాసీతో కలిసి నివసిస్తూండేవాడు. పేదవాళ్ళే అయినప్పటికి, ఆ వృద్ధ దంపతులు కష్టపడి ద్రాక్ష పండించి, ఆ రాబడితో తృప్తిగా కాలం వెళ్ళబుచ్చసాగారు.





ఆ వృద్ధ దంపతులకు, ఒకనాడు కుక్కలు మొరగడమూ, పిల్లల కేకలూ వినిపించాయి. కొత్తవాళ్ళెవరయినా వచ్చారేమో అని వాళ్ళు అనుమానించారు. ఎందుకంటే — కొత్తవాళ్ళెవరయినా వస్తే వాళ్ళమీదికి కుక్కలనూ, పిల్లలనూ ఉసిగొలిపి హింసించడం ఆ గ్రామస్థుల దురాచారం!



వృద్ధదంపతులు గుడిసెనుంచి వెలుపలికి వచ్చి చూశారు. ఇద్దరు బాటసారులు కనిపించగానే, వాళ్ళను గుడిసె లోపలికి తీసుకుపోయారు. "ఈ గ్రామస్థులు పిల్లల నెందుకు ఇలాంటి పాడు పనులకు ప్రోత్సహిస్తున్నారు? అందుకే ఈ లోయవైపు ఎవరూ రావడం లేదు!" అన్నారు బాటసారులు.

వృద్ధదంపతులు, వాళ్ళను ఆప్యాయంగా కూర్చోబెట్టి, తమ దగ్గరున్న సగం రొట్టెను వాళ్ళ ఎదుట ఉంచారు. కూజాలో ఉన్న కొద్ది పాలను, బాసీ రెండు గిన్నెలలోకి పోసింది. బాటసారులు ఆ పాలను తాగేసి, "పాలు చాలా రుచిగా వున్నవి. ఇంకా కొంచెం ఇస్తారా?" అని అడిగారు.





కూజాలో పాలు లేవు. "క్షమించండి, ఇందులో ఒక్క చుక్క కూడా లేదు," అన్నది బాసీ. ఆ మాటకు ఒక బాటసారి చిన్నగా నవ్వి, "అర చుక్క వున్నా ఫరవాలేదు, అదే చాలు," అన్నాడు. బాసీ నిట్టూరుస్తూ, కూజాను, గిన్నెలోకి వంచింది. కూజానుంచి వచ్చిన పాలతో రెండు గిన్నెలూ నిండాయి!

"మీరూ తీసుకోండి. కూజాలో ఇంకా పాలు మిగిలే ఉన్నాయి!" అన్నారు బాటసారులు. ఆశ్చర్యంతో వృద్ధ దంపతులు పాలను కొద్దిగా రుచిచూశారు. చెప్పరానంత రుచిగా ఉన్నాయి. అదే విధంగా బాటసారులు సగం రొట్టెనుంచి ఎన్ని ముక్కలు కోసినా, అది తరగకుండా అలాగే ఉన్నది!





బాటసారు లిద్దరూ, ఆ రాత్రి గుడిసెలోనే నిద్రపోయారు. తెల్లవారగానే ప్రయాణానికి సిద్ధమయ్యారు. అప్పుడు వాళ్ళ క్షేమంకోసం, ఆ గ్రామందాటేంతవరకు వాళ్ళవెంట వస్తామని వృద్ధదంపతులు చెప్పారు.

అందరూ ఆ గ్రామంకేసి చూశారు. అయితే, అక్కడ గ్రామం లేదు. దాని స్థానంలో చిన్న సెలయేటితో ఒక తటాకం కనిపించింది. ఆ దృశ్యాన్ని చూసి వృద్ధ దంపతులు దిగ్భ్రాంతి చెందారు. "తమ పాప కృత్యాలవల్ల గ్రామస్థులు ఈ లోయలో నివసించే అర్హతను కోల్పోయారు. అందుకే తటాకం మళ్ళీ ఆ స్థలాన్ని ఆక్రమించింది. గ్రామస్థులు ఇప్పుడు తటాకంలో చేపలుగా ఉంటున్నారు!" అని వివరించారు బాటసారులు.





"ఇప్పుడు వెనక్కు తిరిగి చూడండి," అన్నారు బాటసారులు. వృద్ధుల పాత గుడిసె వున్న స్థానంలో అందాల భవనం కనిపించింది. "ఇటువైపు వచ్చే బాటసారులను మీరు ఆదరిస్తున్నారు. మీచేతనైన సాయం చేస్తున్నారు. కాబట్టి మీకు మరింత పెద్ద ఇల్లు కావాలి కదా!" అన్నారు బాటసారులు. వృద్ధదంపతులు వారికి నమస్కరించారు. మరుక్షణమే బాటసారులు కూడా మాయమైపోయారు.

ఆరోజునుంచీ రుచికరమైన పాలు కూజా నుంచి ఆగకుండా వస్తూనే ఉండేవి. ఇంటికి వచ్చిన బాటసారులు ఆ పాలను సంతోషంగా తాగేవారు. వృద్ధదంపతుల ద్రాక్ష తోటలో మధురమైన ద్రాక్ష పళ్ళు పండేవి. వృద్ధులయినప్పటికీ ఆ దారే వచ్చేవారిని వాళ్ళు ఎంతో ఆప్యాయంగా ఆదరిస్తూ వచ్చారు.





తటాకం చుట్టూ మళ్ళీ క్రమంగా కొత్త గ్రామం ఏర్పడింది. ఆవృద్ధదంపతులను అక్కడివాళ్ళు ఎంతో గౌరవించేవారు. అయితే, ఆ తటాకంలోని చేపలు ఒకప్పుడు అక్కడి మనుషులే గనక వాటిని ఎవరూ తినేవాళ్ళుకారు. ఒకనాడు ఫిలేమాన్, బాసీ అదృశ్యమైపోయి, రెండు సిందూర, నిమ్మ వృక్షాలుగా మారి, వచ్చినవారికి చల్లని నీడ నివ్వసాగారు!



# దయాగుణం

సీతాపురంలో లక్ష్మీపతి అనే భాగ్యవంతుడున్నాడు. ఆయన వ్యాపారంలో తన తెలివితేటలతో బాగా రాణించి, కోటికి పడగలెత్తాడు. తనంత గొప్పవాడు లేడని ఆయన అనుకుంటూండేవాడు.

ఒక రోజున లక్ష్మీపతి ఇంటికి చలపతి అనే బంధువు వచ్చాడు. చలపతికి డబ్బు లేదు కానీ కీర్తిప్రతిష్ఠలు వున్నాయి. అతణ్ణి చూడడానికి సీతాపురం ప్రజలు లక్ష్మీపతి ఇంటికి తండోపతండాలుగా వచ్చారు.

ఇది చూసి లక్ష్మీపతికి అసూయ పుట్టింది. ఆయన చలపతిని ఏకాంతంలో, ''నీలో విశేషమేమిటి? ప్రజలు నిన్ను చూడాలని ఎందుకు తహతహలాడుతున్నారు?'' అని అడిగాడు.

''ఈ ప్రపంచంలో డబ్బు సంపాయించడం, అన్నిటికంటే సులభమైన విషయం. డబ్బు సంపాయించాలంటే మనిషి స్వార్థపరుడు కావాలి. స్వార్థపరులకు సమాజంలో సుఖముంటుంది కానీ ప్రత్యేక గౌరవం వుండదు. ఈ ప్రపంచంలో అన్నిటికంటే కష్టమైనది దయాగుణం! సాటి మనిషి కష్టపడుతూంటే, దయాగుణం కలవాడు చూస్తూ వూరుకోలేడు. దయాగుణం కలవాడు తన శత్రువుల్ని కూడా ప్రేమించగలడు. దయాగుణంతో నేను నా సిరిసంపదలు పోగొట్టుకున్నాను. దయాగుణం గొప్పతనాన్ని పదిమందికీ చెప్పి ప్రజలమనసుల్లో మార్పు తీసుకురావాలని, నేను దేశమంతా తిరుగుతూ, ఈ ఊరుకు వచ్చాను,'' అన్నాడు చలపతి.

చలపతి ఆ ఊళ్ళో పది రోజులుండి నాలుగు ఉపన్యాసాలిచ్చి వెళ్ళాడు.

తను కూడా చలపతి లాగా దయాగుణం చూపి పేరు తెచ్చుకోవాలని, లక్ష్మీపతిలో కోరిక పుట్టింది. బాగా ఆలోచించి




ముందు కాపలా కాసే వీరరాజును తప్పించు కుని, ఆ గదిలో వున్న డబ్బు దొంగి లించడం కష్టం. వాడు పట్టుబడక తప్పదు. అప్పుడు లక్ష్మీపతి వాణ్ణి క్షమించి, తనవద్దనే పని ఇస్తాడు. పరిస్థితుల కారణంగా దొంగగా మారిన వాళ్ళందరికీ, ఈ సంఘటన కొంత ఆశలు కలిగిస్తుంది!

సీనయ్య దీనికి సంతోషంగా ఒప్పుకుని, ఒక రాత్రివేళ లక్ష్మీపతి ఇంటికి దొంగ తనానికి వెళ్ళాడు. డబ్బు గది తలుపుకు పెద్ద తాళం వేసి వున్నది. కొంచెం దూరంలో వీరరాజు ఆదమరిచి నిద్ర పోతున్నాడు. సీనయ్య కావాలనే కాస్త ఎక్కువ చప్పుడు చేస్తూ తాళం తీశాడు.

వీరరాజుకు మెలుకువ వచ్చింది. ఎవడో దొంగ డబ్బు గదితాళం తీయడం, వాడికి ఆశ్చర్యం కలిగించింది. ఎందుకంటేఇంటి చుట్టూ పటిష్ఠమైన కాపలా వుంటుంది. ఆ కాపలా తప్పించుకుని లోపలికి రావడం ఒక ఎత్తయితే, డబ్బు గదితాళాలు సంపాయించడం ఇంకో ఎత్తు.

ఇప్పుడు వీరరాజు రహస్యంగా దొంగ ననుసరించి చూడసాగాడు.

దొంగ గది లోపలి ఇనప్పెట్టె తలుపులు తెరిచాడు. ఇనప్పెట్టె లోపల నగలు, కానులు, వజ్రాలు చూసేసరికి దొంగతో పాటు వీరరాజు కళ్ళు కూడా చెదిరాయి.

ఆయన ఒక పథకం పన్నాడు. ఆ ఊళ్ళోనే తనకు తెలిసిన సీనయ్య అనే పేదవాణ్ణి పిలిచి, "ఒరేయ్! నేను నీకు సాయపడా లనుకుంటున్నాను. గతంలో నువ్వు దొంగ తనాలు చేసి వున్నావు. అందుకని నీకు ఎవ్వరూ పని ఇవ్వడం లేదు. నేను నీకు పని ఇస్తాను. నీవంటి వారందరికీ సాయ పడాలని నా కోరిక. కానీ అలాగని చాటింపు చేయడం నాకిష్టం లేదు. నేను చెప్పినట్లు చేస్తే బాగుంటుంది," అంటూ ఒక ఉపాయం చెప్పాడు.

ఆ ప్రకారం సీనయ్య, లక్ష్మీపతి ఇంట్లో దొంగతనానికి వస్తాడు. డబ్బు గది తాళాలు లక్ష్మీపతే వాడికిస్తాడు. ఆ గది

వాడు దొంగను పట్టుకుని, "ఇక్కడికి వచ్చి ఇనప్పెట్టె తెరిచావంటే, నువ్వు సామాన్యుడివి కాదు. వదిలిపెడితే తప్పించుకుని పారిపోగలవు. దొంగిలించిన సొమ్ములో సగం నాకిచ్చావంటే, నిన్ను వదిలిపెట్టి మత్తుమందు తీసుకుని పడుకుంటాను. ఎవరైనా అడిగితే, దొంగ నాకు మత్తుమందిచ్చాడని చెప్పొచ్చు," అన్నాడు.



ఇదేదో కొత్తవిశేషంలాకనిపించిసీనయ్య తెల్లబోయాడు. లక్ష్మీపతి సాయపడడం వల్ల, తను లోపలికి రాగలిగాడు తప్ప మరొక విధంగా రాలేడు. లక్ష్మీపతి సాయం లేనిదే తనిక్కడినుంచి తప్పించుకోలేడు. పాపం, వీర్రాజుకు ఈ విషయం తెలియదు!

సీనయ్య వెంటనే వీర్రాజుకు అసలు విషయం చెప్పి, "అవకాశం రాకగానీ, మనుషులందరిలోనూ దొంగబుద్ధి వుంటుందని, నీవల్ల ఋజువయింది. నీ సంగతి తెలిస్తే యజమాని నిన్ను పనిలోంచి తీసేస్తాడు. పిచ్చి ఆలోచనలు మాని బుద్ధిగా నన్ను నీ యజమానికి అప్పగించి మంచి పేరు తెచ్చుకో," అన్నాడు.

వీర్రాజు మరుక్షణం సీనయ్య కాళ్ళ మీదపడి, "నిజం చెప్పి, నా ఉద్యోగం నిలబెట్టావు. ఏదో ఒక రోజున నీ ఋణం తీర్చుకుంటాను," అంటూ వాణ్ణి పట్టుకుని లక్ష్మీపతి వద్దకు తీసుకువెళ్ళాడు.

వీర్రాజు చెప్పింది విని లక్ష్మీపతి, సీనయ్యనక్కడే వుండమని, వీర్రాజును బయిటికి పంపి గది తలుపులు వేసి, "ఒరేయ్, తాళంచెవులు నీకిచ్చి, నేనూరికే పడుకుని నిద్రపోతున్నాననుకోకు. రహస్యంగా నిన్ను వెన్నంటి వస్తున్నాను. జరిగిందంతా చూశాను. వీర్రాజులో దొంగబుద్ధి వుంది. అటువంటి వాడిని డబ్బు గదికి కాపలాగా వుంచి నేను పెద్ద పొరబాటు చేశాను. నీవంటి దొంగకున్న నిజాయితీ వాడికి లేదు. వాణ్ణి వెంటనే పనిలోంచి తీసేసి, ఆ ఉద్యోగం నీకిస్తాను. అయితే—వీర్రాజు విషయం నువ్వు ఎందుకు దాచాలనుకున్నావో, నాకు

కారణం చెప్పాలి. నువ్వు చెప్పిన కారణం నాకు నచ్చితేనే, నీకు ఉద్యోగం ఇస్తాను. వాడితో నువ్వన్న మాటలన్నీ, నేను విన్నాను,'' అన్నాడు.

అందుకు సీనయ్య, ''అయ్యా! ఒక సారి దొంగ అనిపించుకున్నవాడికి మళ్ళీ ఎక్కడా పని దొరకదు. ఆ ఇబ్బంది నాకు తెలుసు. దొంగ అనిపించుకున్న నన్నే పిలిచి ఉద్యోగం ఇవ్వాలనుకున్న తమరు, దొంగతనం చేయాలనుకున్నాడని వీర్రాజును పనిలోంచి తీసేస్తారా? తమరి దయాగుణం తెలిసినవాణ్ణి కాబట్టి, వీర్రాజు మీద తమకెలాగూ కోపముండదనుకున్నాను,'' అన్నాడు.

లక్ష్మీపతి కేమనాలో తోచక, ''నువ్వు చెప్పింది నిజమే! వీర్రాజును నేను క్షమించి విడిచిపెట్టేవాణ్ణే. కానీ నువ్వు నాకు, వీర్రాజు దొంగబుద్ధి గురించి చెప్పకపోవడం తప్పేకదా!'' అన్నాడు.

సీనయ్య తల వంచుకుని, ''తప్పే! కానీ మీరెలాగూ వీర్రాజును క్షమిస్తారు కదా! అందుకని అతణ్ణి నేనే క్షమించి దయాగుణం చూపాలనుకున్నాను. మీరు గొప్పవారు. దయాగుణం చూపించే అవకాశం మీకు చాలాసార్లు వస్తుంది. నాబోటి దొంగకు ఇలాంటి అవకాశం ఎప్పుడో కాని రాదు! అందువల్ల, ఆ అవకాశం వదులుకోవాలనిపించలేదు,'' అన్నాడు.

ఇది విన్న లక్ష్మీపతి ఆలోచనలో పడ్డాడు. ఒక దొంగకు కూడా దయాగుణం చూపించాలన్నకోరిక వుంటుంది. తన కలాంటి కోరిక, ఇంటికి వచ్చిన చలపతిని చూసేదాకా పుట్టనేలేదు. పుట్టినా—సీనయ్య చెప్పేదాకా వీర్రాజును కూడా క్షమించాలని తట్టనేలేదు!

ఒక్కసారి దయాగుణం చూపాలనుకుంటేనే, వీర్రాజు వంటి వాడి దొంగబుద్ధి బయటపడి, తనకెంతో ఉపకారం జరిగింది. ఇవన్నీ ఆలోచించి, లక్ష్మీపతి ప్రచారం, కీర్తికోసం కాక నిజంగానే దయాగుణం అలవరుచుకుని మంచి పేరు తెచ్చుకున్నాడు.






హనుమంతుడు సీతతో ఇలా అన్నాడు: ''సీతాదేవీ, నేను రాముడి దూతగా నీ వద్దకు వచ్చాను. రాముడు క్షేమంగా ఉన్నాడు; లక్ష్మణుడు నీకు నమస్కరించినట్టు చెప్పమన్నాడు.''

రామ లక్ష్మణుల మాట వినగానే సీతకు ఒళ్ళు పొంగిపోయింది. కాని హనుమంతుడు మెల్లగా తనను సమీపిస్తూండటం చూసి ఆమె, రావణుడే ఈ కోతి రూపంలో వచ్చాడని భయపడి, తాను పట్టుకుని నిలబడి ఉన్న చెట్టు కొమ్మను వదిలిపెట్టి నేల మీద కూలబడింది.

తనను సీత సంశయించి భయపడుతున్నదని గ్రహించి, హనుమంతుడు ఆమెకు నమస్కరించాడు. కాని సీత అతనికేసి చూడక, నిట్టూర్పులు విడుస్తూ, ''నువ్వు రావణుడివే అయితే, ఇలా మాయకోతి రూపంలో వచ్చి నన్ను దుఃఖపెట్టటం మంచిది కాదు. జనస్థానంలో కూడా ఇలాగే సన్యాసి రూపంలో వచ్చావు. అలాకాక నువ్వు రాముడి దూతవే అయితే రాముడి గుణగణాలు చెప్పు.'' అన్నది.

రావణుడే మాయరూపంలో వచ్చాడన్న అనుమానంతోబాటు, తాను కలగంటున్నట్టూ, తనకు మతి చలించినట్టూ కూడా అనుమానాలు కలిగి, సీత మనసు చాలా క్షోభ పొందింది.

అది గ్రహించి హనుమంతుడు రాముడి ముద్రికను సీతకు ఇచ్చి, రాముడి గుణ

14. అశోకవన విధ్వంసం



గుణాలు పొగడుతూ మాట్లాడి, తాను లంకకు ఎలా వచ్చినదీ తెలిపి, సీత మనసుకు ఊరట కలిగించాడు. అతను ఆమె కోరికపై రామలక్ష్మణుల ఆనవాళ్లు వివరంగా చెప్పాడు. తరవాత అతను, రాముడికీ, సుగ్రీవుడికీ మైత్రి కుదిరిన దగ్గిర నుంచీ నడిచిన కథ అంతా చెప్పి, తాను సీతకోసం లంక అంతా గాలించటం గురించి కూడా చెప్పాడు. అంతా విని సీత ఆనందబాష్పాలు రాల్చింది. ఆమెకు ఇప్పుడు హనుమంతుడి పైన విశ్వాసం కుదిరింది.

అంతా చెప్పి హనుమంతుడు సీతతో, ''నే నిప్పుడిక ఏం చెయ్యాలి? నీకేం తోస్తున్నది? నేను రాముడివద్దకు త్వరగా తిరిగి వెళ్ళాలి. ఆయన నా కోసం ఎదురు చూస్తూంటాడు,'' అన్నాడు.

సీత హనుమంతుడితో, ''సముద్రాన్ని దాటి, రాక్షసులను తప్పించుకుంటూ లంకలో తిరుగుతున్న నీ ప్రజ్ఞ చాలా గొప్పది. నాకు రావణుడు పెట్టిన ఏడాది గడువు తీరే లోపుగా రాముణ్ణి రమ్మని చెప్పు. రావణుడి తమ్ముడు విభీషణుడు నన్ను రాముడికి ఇచ్చెయ్యమని సలహా ఇచ్చినా రావణుడు వినలేదు. విభీషణుడి కూతురు నల అనేది, తన తల్లి పంపగా నా దగ్గిరకువచ్చి, నాకీ సంగతి చెప్పింది,'' అన్నది.

హనుమంతుడు ఆమెతో, ''నేను వెళ్ళి నీమాట చెప్పగానే రాముడు వానరులనూ, భల్లూకాలనూ వెంట బెట్టుకుని ఇక్కడికి వచ్చేస్తాడు. అలా కాకపోతే, నా వీపు మీద ఎక్కావంటే, సముద్రాన్ని దాటి, నిన్ను రాముడి వద్దకు తీసుకుపోగలను. నాకు సాధ్యం కాదని భయపడవద్దు. కావాలంటే నేను రావణుడితో సహా ఈ లంకనే తీసుకుపోగలను. అలా చేస్తే అతి శీఘ్రంగా నీకు రాముడు కనిపిస్తాడు,'' అన్నాడు.

''ఇంత చిన్న శరీరంతో నన్ను అమితమైన దూరం తీసుకుపోదామనుకుం

టున్నావే, హనుమంతుడా! అందుకే నువ్వు కోతివైనావు.'' అన్నది సీత.

సీతకు తన శక్తి సామర్థ్యాలు తెలియక ఇలా అన్నదని హనుమంతుడు గ్రహించి, తన అసలు రూపం ఆమెకు చూపించాలనుకున్నాడు. అతను కొంచెం దూరం వెళ్ళి, తన దేహాన్ని పెంచనారంభించాడు. పర్వతం లాటి అతని ఆకారమూ, ఎర్రని ముఖమూ, కోరలూ, గోళ్ళూ చూసి సీత, ''ఇతను నిశ్చయంగా లంకానగరాన్నే పెల్లగించుకు పోగలడు, సందేహం లేదు,'' అనుకున్నది.



''సీతాదేవీ, అనుమానాలు మాను. ఆలస్యం చెయ్యకు. రామ లక్ష్మణుల దుఃఖం పోగొట్టు,'' అన్నాడు హనుమంతుడు.

''హనుమంతుడా, నీ శక్తి సామర్థ్యాలు నాకు బాగా తెలుసు. నన్ను నువ్వు తీసుకుపోతే ఏ రాక్షసులూ నిన్ను అడ్డలేరు. అయితే రాముడి పని పాడు కారాదు. నేను నీ వెంట రావటం పొరపాటు అవుతుంది. నువ్వు వాయువేగంతో పొయ్యేటప్పుడు నేను భయపడి, సముద్రం చూసి, కళ్ళు తిరిగి, అందులో పడిపోగలను. నువ్వు ఎంత మహా వీరుడివైనా నన్ను రక్షించే బాధ్యత నీ పైన ఉండటం చేత అపాయానికి గురి అవుతావు. నీ వెంట రాక్షసులు పడి నీతో యుద్ధం ఆరంభిస్తే నేను పడిపోయి, రాక్షసులకు చిక్కవచ్చు. ఇప్పటిదాకా పడిన నీ శ్రమ అంతా వ్యర్థమవుతుంది. అంతకన్నా, నువ్వు వెళ్ళి రాఘుడితో నా సంగతి చెప్పి, అతన్ని పిలుచుకు రావటం అన్ని విధాలా మేలు. అది అలా ఉంచి, నేను పరపురుషుణ్ణి తాకను. రావణుడు నన్ను బలాత్కారంగా తెచ్చినప్పుడు నేను నిస్సహాయురాలినై ఉండి, ఏమీ చేయలేకపోయాను,'' అని సీత హనుమంతుడితో అన్నది.

ఆమె చెప్పిన మాటలు యుక్తంగానే ఉన్నాయని హనుమంతుడు ఒప్పుకున్నాడు. అతను సీతను ఏదన్నా గుర్తుగా



ఇయ్యమనీ, దానిని రాముడికి చూపుతాననీ అన్నాడు.

దానికి సీత ఇలా అన్నది:

''నేనొక సంఘటన చెబుతాను. దానిని రాముడికి చెప్పు. నేనూ, రాముడూ గంగా తీరాన, చిత్రకూట పర్వతానికి ఈశాన్య దిక్కున ఒక ఆశ్రమంలో ఉండగా ఒక నాడు రాముడు నా తొడ మీద తల పెట్టుకుని నిద్ర పోతున్నాడు. అప్పుడొక కాకి వచ్చి నన్ను పొడిచి గాయం చేసింది. నా రక్తంతో రాముడు కూడా తడిశాడు. నేను లేచేసరికి, రాముడు నా రక్తం చూసి మండిపడి, ఒక దర్భ తీసి, బ్రహ్మాస్త్రం మంత్రించి కాకి మీద ప్రయోగించాడు. ఆ బ్రహ్మాస్త్రం కాకిని తరుముతూ పోయి, సమస్త లోకాలూ తిప్పింది. ఇంద్రుడి కొడుకైన ఆ కాకి ఎక్కడా రక్షణ దొరకక, తిరిగి వచ్చి రాముడి కాళ్ళపైన పడింది. బ్రహ్మాస్త్రాన్ని వ్యర్థం చెయ్యటానికి లేదు. అందుచేత కాకి తన కుడికన్ను ఆ అస్త్రానికి బలిచేసి, అక్కడి నుంచి వెళ్ళిపోయింది. అలాటి శక్తిగల రాముడు శత్రువులను నాశనం చేసి నా కష్టాలు ఎందుకు తీర్చడు? నేనేం పాపం చేశాను?''

''అమ్మా, రాముడు పుట్టెడు దుఃఖంలో ఉన్నాడు. నేను ఎంతో ప్రయాసపడి వచ్చి నిన్ను చూశాను. ఇప్పుడు నువ్వు ఆనందించాలి గాని, దుఃఖించరాదు. రాముడు త్వరలోనే వచ్చి, రావణుణ్ణి చంపి, నీతోసహా అయోధ్యకు పోతాడు,'' అన్నాడు హనుమంతుడు.

సీత హనుమంతుడితో, ''హనుమంతుడా, నువ్వు రాముణ్ణి చూడగానే నాకు బదులుగా సాష్టాంగ నమస్కారం చెయ్యి. లక్ష్మణుడు ఉత్తముడు. అతను సమస్తమూ విడిచిపెట్టి, రాముడి వెంట అరణ్యాలకు వచ్చాడు. అతన్ని క్షేమం అడిగానని చెప్పు.'' అంటూ తన కొంగున కట్టుకుని ఉన్న చూడామణి తీసి అతనికి ఇచ్చింది.

హనుమంతుడు చిన్న రూపంలోనే ఉన్నప్పటికీ తల వెంట్రుకలు దూర వలసిన రంధ్రంలో అతని చెయ్యి దూర లేదు. అందుచేత అతను దానిని తన వేలికి తగిలించుకుని, సీతకు ప్రదక్షిణ నమస్కారాలు చేసి నిలబడ్డాడు.

"హనుమంతుడా, రాముడు ఈ చూడా మణిని చూడగానే నా తల్లినీ, నన్నూ, దశరథుణ్ణీ గుర్తుకు తెచ్చుకుంటాడు. ఇక జరగవలసిన దంతా నీ మీదనే ఆధారపడి ఉన్నది. నా దుఃఖం తీరే మార్గం నువ్వే ఆలోచించి చెయ్యి." అని సీత అన్నది. ఆమె సుగ్రీవుణ్ణీ, అతని మంత్రులనూ, వానర శ్రేష్ఠులనూ అడిగి నట్టు చెప్పమన్నది.

ఆమెకు ఇంత చెప్పిన తరవాత ఒక సందేహం పట్టుకున్నది.

"హనుమంతుడా, నువ్వయితే ఈ సముద్రాన్ని దాటి రాగలిగావు గాని, రామలక్ష్మణులూ, ఇతర సేనలూ ఇక్కడికి ఎలా వస్తారు? రావణుడితో ఎలా యుద్ధం చేస్తారు? నువ్వే యుద్ధంచేసి రావణుణ్ణి చంపితే రాముడికి గాని, నాకుగాని ఏమి కీర్తి వస్తుంది?" అని ఆమె అడిగింది.

దానికి హనుమంతుడు, "సీతాదేవీ, వానర, భల్లూక సైన్యాలకు అధిపతి అయిన సుగ్రీవుడు తలుచుకుంటే ఏదైనా చెయ్యగలడు. అతని సేనలో నాతో సమానులూ, నన్ను మించిన వాళ్ళూ ఎందరో





ఉన్నారు. నేనే సముద్రం దాటగా, వాళ్ళు దాటటం ఒక లెక్కా? అందుచేత నువ్వు విచారించకు. నీకు క్షేమం కలుగుగాక!'' అని సీత వద్ద సెలవు పుచ్చుకుని అక్కడి నుంచి కదిలాడు.

కొంత దూరం వెళ్ళాక అతను తనలో, ''సీతను చూశాను. కాని ఇంకొక్క చిన్న పని దిగబడి పోయింది. ఇది శౌర్య పరాక్రమాలతో గాని జరగదు. కొందరు రాక్షసులను చంపితే గాని మిగిలిన రాక్షసులు మెత్తబడరు. రాక్షసులు ఎలా యుద్ధం చేస్తారో, వారి బలం ఏపాటిదో చూసి మరీ కిష్కింధకు తిరిగి వెళతాను. రాక్షసులను యుద్ధానికి ప్రేరేపించటానికి సులువైన మార్గం ఏమిటి?'' అని ఆలోచించాడు.

అశోకవనం చాలా అందంగా, నందన వనాన్ని పోలి ఉన్నది. అది రావణుడికి చాలా ఇష్టం అయి ఉండాలి. దీన్ని తాను ధ్వంసం చేస్తే రావణుడికి తప్పక కోపం వస్తుంది. అప్పుడు రావణుడు తన పైకి రాక్షస సేనలను పంపుతాడు. యుద్ధం జరుగుతుంది. తాను ఆ రాక్షసు లందరినీ చంపి, నిశ్చింతగా కిష్కింధకు వెళ్ళిపోవచ్చు.

ఇలా ఆలోచించి హనుమంతుడు అశోకవనంలో ఉన్న చెట్లను పడదోయ సాగాడు. అతను చెట్లను పడగొట్టటంతో బాటు, అందంగా కట్టిన కొలను గట్లు విరిచి, క్రీడాపర్వతాల శిఖరాలను విరిచాడు. కొద్ది సేపట్లోనే అశోకవనం బీభత్సరూపం ధరించింది. చెట్ల మీద ఉండిన పక్షులు అటూ ఇటూ ఎగురుతూ ఆర్తనాదాలు చేశాయి.

విరిగిన చెట్లూ, తెగిన లతలూ వాడు ముఖంపెట్టాయి. అశోకవనమే దుఃఖంలో మునిగిపోయినట్టు కనబడింది.

ఇదంతా చేసిన హనుమంతుడు సరాసరి వెళ్ళి, అశోకవనం తాలూకు బయటి ద్వారం వద్ద నిలబడి, రాక్షసుల కోసం ఎదురు చూడసాగాడు.

చెట్లు విరిగే చప్పుడూ, పక్షుల ఆర్త నాదాలూ లంకలో వాళ్ళకు వినిపించాయి. అంతదాకా నిద్రపోతున్న రాక్షస స్త్రీలు ఈ ధ్వనులకు లేచి, పెంచిన దేహంతో వనాన్ని ధ్వంసం చేస్తున్న హనుమంతుణ్ణి చూశారు. వాళ్ళు తనను చూడటం గమనించి, హనుమంతుడు తన దేహాన్ని మరింతగా పెంచాడు.

అప్పుడా రాక్షసస్త్రీలు సీతను, "ఇతను ఎవరు? ఎవరుపంపారు? ఎందుకు వచ్చాడు? నీతో ఏం మాట్లాడాడు? నువ్వు భయపడకు, మాతో నిజం చెప్పు." అన్నారు.

"రాక్షసులు రకరకాల రూపాలు ధరిస్తారు. నాకు వాళ్ళసంగతి ఎలా తెలుస్తుంది? పాము కాళ్ళు పాముకే తెలియాలి. మీరూ రాక్షసులే గనక రాక్షస మాయలు మీకే తెలుస్తాయి. ఈ వానరుడెవడో, ఏం చేస్తాడో మీరే తెలుసుకోండి. ఇతన్ని చూస్తే నాకు భయంగానే ఉన్నది. చెప్పండి, ఇతనెవడు?" అన్నది సీత.

సీత ఇలా అనేసరికి రాక్షసస్త్రీలు భయపడ్డారు. కొందరు సీతకు రక్షగా ఉండి పోగా, కొందరు భయంతో ఆర్త నాదాలు చేస్తూ పారిపోగా, మరి కొందరు ఈ సంగతి రావణుడికి చెప్పటానికి వెళ్ళారు.

అలా వెళ్ళిన వాళ్ళు రావణుడితో, "ఎవడో భయంకరాకారుడూ, అమిత బలవంతుడూ అయినవాడు వచ్చి, సీతతో మాట్లాడి, అశోకవనంలో ఉన్నాడు. ఎంత అడిగినా, సీత అతని సంగతి చెప్పకుండా ఉన్నది. ఆ వానరుడు దేవేంద్రుడి దూత అయినదీ, కుబేరుడి దూత అయినదీ, రాముడి దూత అయినదీ తెలియటం లేదు. వాడుమాత్రం అశోకవనమంతా ధ్వంసం చేసేస్తున్నాడు. ఒక్క సీత కూర్చుని ఉన్న చెట్టు తప్పిస్తే మిగిలిన వనమంతా కూలిపోయింది. ఆ వానరుణ్ణి నువ్వు వెంటనే కఠినంగా శిక్షించాలి. సీతతో మాట్లాడినందుకే నువ్వు వాణ్ణి చంపవచ్చు." అన్నారు.





# మాయాతల్పం

పరోపకారి అయిన ధర్మసింధువు నేపాళ దేశానికి రాజుగా ఉండేవాడు. ఆయన త్యాగమూర్తి. ధర్మసింధువుకు మారు వేషాలతో పాదచారిగా ప్రయాణంచేయటం అలవాటు.

ఒకప్పుడు ధర్మసింధువు సాధారణ పౌరుడి లాగా బయలుదేరిపోయి, కొన్నాళ్ళకు ఒక పర్వతప్రాంతం చేరుకున్నాడు. మరి కొంతదూరంలో ఒక లోయ తగిలింది. అటుపైన ఆయనకు దారీ తెన్నూ కనిపించలేదు.

ధర్మసింధువు అక్కడే నిలబడి ఆలోచిస్తూండగా ఆ లోయ పక్కనుంచి, ఒక అజానుబాహు వచ్చాడు. అతడు ధగధగ మెరిసే దుస్తులు వేసుకున్నాడు. చక్కటి చేతికర్ర పట్టుకొని వున్నాడు. మంచి బలశాలి, అందగాడు, పెద్దమనిషిలాగా వున్నాడు.

ఆ పెద్దమనిషి, సామాన్యుడి వేషంలో కనపడే ధర్మసింధువుకు ఎదురు వచ్చి, "నాయనా, అలసిపోయినట్టున్నావే? ఎవరు నీవు? ఎక్కడినుంచివస్తున్నావు? ఎక్కడికి వెళ్ళాలి? రా, ఇలాగే పాపం, వేళనక పాళనక ఎంతోమంది ప్రయాణాలు చేస్తూ వుంటారు. అటువంటివారికి రాత్రిపూట బస ఇచ్చి, సదుపాయంచేయకపోతే ఎలా నాయనా? నాతో రా," అంటూ ఆప్యాయంగా పిలిచాడు.

ధర్మసింధువుతనప్రయాణాన్నిగురించి చెప్పేసరికి, ఆ పెద్దమనిషి, "అయ్యో, పాపం! దారి తప్పి చాలాదూరం వచ్చేశావు. ఈ సమయంలో కొండలూ కోనలూ దాటుకుపోవటం ఎవరి శక్యం? ఐతే ఏంలే, భయపడకు. నేనున్నాను కదా. నాతోపాటు భోజనం చేసుకొందువుగాని. చిత్రమైన పక్క చూపుతా, దాని మీద హాయిగా

నేపాళ జానపదకథ



"అయ్యో బాబుల్లారా! ఎటూ గాని వేళ ఈ ప్రయాణమేమిటి? రండి, నాతో రండి. మా ఇంట్లో ఇంత కడుపు చలవ చేసుకుని, రాత్రికి విశ్రమించి, తెల్లవారగానే లేచి మీ దారిని మీరు వెళుదురు గాని. ఇవాళ నిజంగా ఎంతటి సుదినం! ఎంత పుణ్యం! ఇంతమంది అతిథులను సేవించుకునే భాగ్యం నాకు కలిగింది." అంటూ, అభిమానంగా వర్తకులందరినీ పిలిచాడు.

పెద్దమనిషి ఆ వర్తకులతో మాటాడుతూ వున్న సమయాన, ధర్మసింధువుకు కొంత దూరంలో ఒక వృద్ధుడు కనిపించాడు. వాడు కట్టెలమోపు ఎత్తుకోలేక అవస్థపడు తున్నాడు. వాడికి సాయం చేద్దామని ధర్మసింధువు అటు వెళ్ళేసరికి, వృద్ధుడు కుశలప్రశ్నలు వేశాడు.

అందుకు ధర్మసింధువు తన సంగతి సందర్భాలన్నీ వెల్లడించి, తరవాత, "తాతా, ఒక దయామయుడు కనిపించి, ఈ రాత్రికి ఇక్కడ ఉండిపొమ్మని నన్ను ఎంతో ఆప్యాయంగా కోరాడు," అని చెప్పాడు.

ఈ మాటలకు వృద్ధుడు తల వంచి, పెద్దగా నిట్టూర్చాడు.

"అయ్యో! నిన్నూ మాయలో వేశాడా ఆ దుర్మార్గుడు. లక్షణంగా వున్న నిన్ను

పడుకుని నిద్రపోయి, తెల్లవారగానే పోవచ్చు." అన్నాడు.

ఇలా ఒక పెద్దమనిషి ఎంతో అభిమానించి అతిథ్యమిస్తానంటే వద్దనటం భావ్యం కాదని ధర్మసింధువు ఆ పెద్దమనిషి వెంట నడిచాడు.

ఇద్దరూ కలిసి కొంత మీద నడిచి వెళుతూ వుండగా, దిగువలోయలో సందడి వినిపించింది. ఆ సందడి చేస్తున్నది ఒకానొక వర్తకులగుంపు. వాళ్ళు గాడిదలపైన సరకు మూటలు వేసుకొని వస్తున్నారు. ఇది చెవిని పడగానే పెద్దమనిషి ఇప్పుడే వస్తానని ధర్మసింధువుతో చెప్పి, వాళ్ళ వద్దకు వెళ్ళాడు.

చూస్తుంటే నాకు బాధగా వున్నది. నీవనుకొంటున్న ఆ దయామయుడు నిజంగా పెద్దమనిషి కాడు. పరమ దుర్మార్గుడు. వాడు చెప్పిన ఆ చిత్రమైన పక్క నిజమయింది కాదు నాయనా, అది మాయాతల్పం,'' అంటూ వృద్ధుడు మళ్ళీ నిట్టూర్చాడు.

ఆ మాటలకు ధర్మసింధువు, ఆశ్చర్య పడి పెద్దమనిషిగా నటించే ఆ దుర్మార్గుణ్ణి గురించి ఇంకా వివరంగా చెప్పమని అడిగాడు. అప్పుడు వృద్ధుడు ఇలా చెప్ప నారంభించాడు:

''నాయనా, వీడొక రాక్షసాంశ గల పరమ దుర్మార్గుడు. పేరు ధూర్తకేతు. ఇష్టం వచ్చినట్టుగా బంగారం తయారు చేయాలనే కాంక్షతో 'అసురశక్తి' అనే ఒక దుష్టదేవతను చాలా కాలం ఉపాసించాడు. వాడి భక్తికి మెచ్చి, అసురశక్తి ప్రత్యక్ష మయి, 'కేతూ, నీ భక్తికి మెచ్చాను. నీ కోరిక నెరవేరాలంటే, అదిగో ఆ మూలనున్న మంచం తీసుకో. దానిపేరు భల్లూకతల్పం. అది ఎలుగుబంటి రోమా లతో తయారైన మహిమగల మంచం. ఆ మంచానికి సరిగా సరిపడే పొడవుగల నరుణ్ణి తెచ్చి నాకు బలి ఇచ్చిన నాడు నీ కోరిక తప్పక నెరవేరుస్తాను,' అని చెప్పి మాయమైంది.



''ధూర్తకేతు సంతోషించి గుడిలోని ఆ తల్పం ఇక్కడికి తీసుకవచ్చాడు. ఈ భవనం నిర్మించాడు. లోయ దగ్గర కాచు కొని వుండి వచ్చేపోయే బాటసారులను ఆతిథ్యమిస్తానని పిలుస్తాడు. తన తల్పాన్ని గురించి పొగుడుతూ అమాయకు లైన ప్రయాణీకులను ఆకర్షించి మోసగి స్తాడు. ఎంతకాలం నుంచో ప్రజలను తన భవనంలోకి లాక్కొంటూ, తల్పం మీద పడుకొన్న తరువాత వాళ్ళ పొడవు ఎక్కు వయితే తల్పానికి సరిపడేటట్టుగా కాళ్ళకు కట్టుకట్టి పొట్టి చెయ్యటానికి చూస్తాడు. పొడవు సరిపోకపోతే నిర్దాక్షిణ్యంగా కాళ్ళు పట్టి సాగదీస్తాడు. ఈ యాతనలు భరించ



లేక జనం చస్తున్నారు. ఐతే, ఆ తల్పానికి సరిగా సరిపడిన పొడవుగలవాడిని. నేనొక్కణ్ణే....''

వృద్ధుడి ఆ మాటలు విన్న ధర్మసింధువు, ''మరి తాతా, నువ్వింకా బతికే వున్నావే! నిన్ను శక్తికి బలి ఇవ్వలేదా?'' అని అడిగాడు.

అందుకు ముసలివాడు ఇలా చెప్పాడు:

''నాయనా, కొంతకాలం క్రిందట నీలాగే నేనూ ఈ దారిని ప్రయాణం చేయవలసి వచ్చింది. నన్నూ ధూర్తకేతు ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించి తన భవనం లోపలికి తీసుకువెళ్ళాడు. దివ్యమైన భోజనం పెట్టించాడు. ఆ తల్పం చూపించి హాయిగా నిద్రించమని చెప్పి వెళ్ళిపోయాడు.

''మామూలుగా పడుకొన్నాను. నా పొడవు ఆ తల్పంకన్న సుమారు ఒకమూర ఎక్కువగా ఉన్నది. ఇదేదో చిత్రంగా ఉన్నదనిపించింది. ఎంతకూ నిద్రపట్టింది కాదు. అప్పుడు తలగడ తీసి కాళ్ళవైపు తల పెట్టుకొని, కాళ్ళుచాచి పడుకునేసరికి, నా పొడవు ఆ తల్పం పొడవుకు సరిగా సరిపోయింది. తల్పంలో వుండే మర్మం తెలిసిపోయింది. నిద్ర పట్టకపోయినప్పటికీ కళ్ళు మూసుకొని అలాగే పడుకున్నాను.

"ఒక రాత్రివేళ ధూర్తకేతువచ్చిచూసేసరికి, నేను తల్పానికి సరిగా హెచ్చుతగ్గులేమీ లేకుండా ఉండటం గమనించాడు. ఇంత కాలానికి తన ఇష్టదేవతకు తగిన మనిషి దొరికాడుకదా అని ఉప్పొంగిపోయాడు. నాటినుంచీ వాడు నన్ను ఎంతో దయగా చూస్తూ, ఏ లోటూ రాకుండా పోషిస్తూ వచ్చాడు. తరవాత బలివేయటానికి సుముహూర్తం పెట్టించాడు. ఈ సంగతి పరిచారకులవల్ల నాకు ముందుగానే తెలిసింది.

''బలికి ముందటిరాత్రి అర్ధరాత్రివేళ మళ్ళీ నా గదిలోకి వచ్చి ఒకసారి నన్ను వాడు చూశాడు. అప్పుడు కావాలనే, నేను

తలవైపు సవ్యంగా పడుకొనివున్నాను. చూడగా నా కాళ్ళు తల్పానికి సుమారు మూరెడు పొడవు హెచ్చుగా కనిపించినై. ఇది చూస్తూనే ధూర్తకేతు ఆశ్చర్య పోయాడు. వాడికి ఏమీ అంతుపట్టలేదు. 'గత రాత్రి తల్పానికి సరిగావున్న మనిషి తెల్లవారేసరికి పెచ్చుపెరిగి ఉన్నాడేమిటి!' అనుకొని వెంటనే ఏమి చేయడానికీ తోచక వెళ్ళిపోయాడు.

''తల్పమైతే అత్రంకొద్దీ తెచ్చాడేగాని, ఆ దేవతను అడిగి దాని రహస్యం వాడు తెలుసుకోలేదు. ఆ దేవత వాడికి చెప్పనూ లేదు. ఇప్పుడు ఆశ్చర్యం కలిగి, ఈ రహస్యం ఏమిటో నన్ను చెప్పమని కూర్చున్నాడు. నేను చెప్పలేదు. నన్ను నానా యాతనలూ పెట్టాడు. నేను నా పట్టు వదలలేదు. లాభంలేక, విసిగి వేసారి నన్నొక బానిసగా చేసివేశాడు. రోజూ వాడు తోడమని చెప్పినన్నినీళ్ళూ తోడాలి. మోయ మన్నన్ని కట్టెల మోపులు మోయాలి. నన్ను ఎన్నివిధాల హింసించినా, ఇప్పటి వరకూ ఆ కీలకం నేను వాడికి వెల్లడించ లేదు. ఇంతవరకు ఆ తల్పానికి సరిపడి, శక్తిబలికి పనికివచ్చే మనిషి మరొకడు దొరకనూ లేదు....''

ఇంతలో లోయలోని వర్తకుల గుంపును వెంటబెట్టుకొని ధూర్తకేతు వస్తున్నట్టు



చప్పుడయింది. ఇది కనిపెట్టి, ముసలి వాడు ధర్మసింధువుకు ఒకేఒక రహస్యం చెవిలోచెప్పాడు. సంతోషంతో సరేఅన్నాడు ధర్మసింధువు.

ఆ రోజున దొరికిన అతిథులందరిలో ధర్మసింధువే అందంగా పొందికగా కన బడటంవల్ల, దివ్యమైన భోజనం పెట్టించి, ముందుగా ధర్మసింధువునే మాయాతల్పం మీద పడుకోమన్నాడు ధూర్తకేతు. ధర్మ సింధువు ఏమీ ఎరుగని అమాయకుడి లాగా, అటువంటి తల్పంమీద పడుకో వటం తనకు కొత్తఅయినట్టు నటించాడు. కొంతసేపయ్యాక కాళ్ళవేపు తలపెట్టుకు పడుకున్నాడు.

ధూర్తకేతు ఒక రాత్రివేళ వచ్చిచూడగా, అతను తల్పానికి సరీగా సరిపోయివుండటం గమనించి పొంగిపోయాడు. వాడు వర్తకుల గుంపును మరిచేపోయాడు. నాటినుంచీ ధర్మసింధువును మంచిమాటలతో అక్కడి నుంచి కదలనివ్వలేదు. పోషిస్తూవచ్చాడు. ఇన్నాళ్ళకు తన దేవి బలికి తగినవాడు దొరికాడుకదా అన్న పట్టరాని సంతోషంతో ప్రపంచమే మరచి సంచరింపసాగాడు ధూర్తకేతు.

ఈలోపల ధర్మసింధువు ఎన్నోసారులు ముసలివాణ్ణి కలుసుకుని, సలహా అడిగాడు. ఇద్దరూ కూడబలుక్కొని ఒక నిర్ణయానికి వచ్చారు.

ఆ నిర్ణయం ప్రకారం, ఒక రోజున ధూర్తకేతుకు మంచి మాటలు చెప్పి, వాడు కాళ్ళవైపు తల పెట్టుకొని తల్పం మీద నిద్రించేటట్టు ధర్మసింధువు యుక్తి చేశాడు. ధూర్తకేతు ఆ తల్పానికి సరీగా సరిపోయాడు. వాడు అదిగమనించకుండా ఆదమరచి నిద్రపోయాడు.

వాడు నిద్రించే సమయాన తల్పంతో సహా ధూర్తకేతును దేవీ విగ్రహం ముందు పెట్టటానికి అంతకుముందే ఏర్పాటు చేశాడు.

తల్పానికి సరీగా సరిపడివున్న ధూర్త కేతును ముసలివాడూ, ధర్మసింధువూ కలిసి బలిచేయబోయారు. కాని, దేవి తన భక్తుడైన ధూర్తకేతుపైన దయదలిచి, వాణ్ణి కాపాడింది. అయితే, వాడు తన మునుపటి శక్తిని కోల్పోయి నిర్వీర్యుడై పోయాడు. వాగ్దానం ప్రకారం అసురశక్తి బంగారం చేసే యోగం ధర్మసింధువుకు చెప్పింది.

ధర్మసింధువు తరవాత లోయలో భవనం వశపరచుకున్నాడు. బోలెడంత బంగారం తయారుచేశాడు. వృద్ధుణ్ణి గురువుగా భావించాడు. ధూర్తకేతు లాగా కాక ధర్మసింధువు, ఆ దారిని వచ్చే బాటసారులందరికీ నిజంగానే ఆతిథ్యమిచ్చే ఏర్పాట్లుచేసి ఆ బాధ్యతను వృద్ధుడికి అప్పగించి, రాజధానికి తిరిగివచ్చాడు.





# పులిమంత్రం

పూర్వం ఒక ఊరిలో సోమశర్మ అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతనికి, మనిషిని పులిగా మార్చే మంత్రం నేర్చుకోవాలని కుతూహలంగా వుండేది. ఐతే, నేర్పే వాళ్ళు ఎక్కడా కనిపించలేదు.

ఒకరోజున, అదృష్టం పండి, పక్కవూరి మఠంలోకి ఒక సన్యాసివచ్చి మకాం చేశాడనీ, అతడు గొప్ప మంత్రవేత్త అనీ తెలిసింది సోమశర్మకు. అతనూ భార్యా మఠానికి పోయి, సన్యాసిని భిక్షకు పిలిచి, అనేక విధాల గౌరవించారు.

భోజనం అయినతరవాత సన్యాసి భుక్తాయాసం తీర్చుకుంటూ సంతోషంగా కూర్చున్న సమయాన, సోమశర్మ ఆయనను ఆశ్రయించి, ఆ మాటా ఈ మాటా చెబుతూ, తన కోరిక తెలిపాడు.

"పులిమంత్రం అతి ప్రమాదకరం; అందుకనే మేము దానిని సాధారణంగా లోకానికి వెల్లడించము," అన్నాడు సన్యాసి.

శర్మ ఆ సన్యాసిని వదలలేదు. సన్యాసికి కాదనటానికి మనస్కరించలేదు.

చివరకు సన్యాసి, "శర్మా, సరే, నీకు పులిమంత్రం నేర్పుతాను. ఐతే, అది కేవలం వినోదం కోసమే పనికివస్తుంది. ఎవరినైనాసరే, వారు కోరితేగాని నీవు పులిగా మార్చలేవు." అని చెప్పాడు.

ఆ తరవాత శర్మకు రహస్యంగా రెండు మంత్రాలు ఉపదేశించి, రెండు రకాల అక్షింతలు చేతికి ఇచ్చి, "శర్మా, మొదటి మంత్రంపఠించి, ఈ ఎర్రఅక్షింతలు చల్లితే, ఏమనిషయినా పులిగామారిపోతాడు. ఆపులి మొహం మీద మాత్రం, నువ్వు మార్చినట్టు ఆనవాలుగా ఒక మచ్చ స్పష్టంగా కనిపిస్తూ వుంటుంది. మీకు సరదా తీరగానే రెండవ మంత్రం పఠించి, పసుపు అక్షింతలు పులి



మొహం మీది ఆ మచ్చపైన పడేటట్టు చల్లితే, అది మళ్ళీ మామూలు మనిషిగా మారిపోతుంది. ఐతే, ఒక్క ముఖ్య విషయం జ్ఞాపకం పెట్టుకో—నీ మంత్రం వల్ల మనిషి పులిగా మారిపోయినప్పుడు, దానికి మనుష్య జ్ఞానం ఉండదు. కనుక, నువ్వు జాగర్తగా వుండాలి,'' అని చెప్పి, సన్యాసి తన దారిని తను వెళ్ళిపోయాడు.

సన్యాసి వెళ్ళిపోగానే, శర్మ భార్యతో ఈ సంగతి చెప్పాడు. అతని భార్య అంతకు ముందెన్నడూ పులిని చూసి యెరుగదు. అందుచేత, పులిని చూపించమని కూర్చుంది. శర్మకు కూడా, మంత్రం పని చేస్తుందో లేదో చూడాలని ఆత్రంగా వున్నది.

అప్పుడు అతడు భార్యతో, ''చూడూ, పులిగా మారుస్తానంటే ఏ మనిషీ ఒప్పుకోడు. వాళ్ళ ఇష్టం లేనిదే నేను వాళ్ళను మార్చలేను. అందుకని నీకు ఆ మంత్రాలు నేర్పుతాను. నన్ను పులిగా మార్చు. నువ్వు చూడటం పూర్తిఅయి, సరదా తీరగానే మళ్ళీ నన్ను మనిషిగా మార్చేద్దువుగాని,'' అంటూ, భార్యకు మంత్రాలు రెండూ నేర్పి, ప్రయోగించే విధానం చెప్పి, అక్షింతలు చేతికిచ్చాడు.

తీరా, పులిగా మారిన తరవాత తను భార్యకు ఎలాంటి హాని కలిగిస్తానోనని ఆలోచించి, ఆమెను అటకపైకి ఎక్కించాడు. తరువాత గది తలుపులన్నీ మూసివేసి, తను అటకకిందకు వచ్చి తయారుగా కూర్చున్నాడు.

అతని భార్య కుతూహలంకొద్దీ మంత్రం పఠించి, అక్షింతలు చల్లి, భర్తను పులిగా మార్చింది.

శర్మ పులిగా మారటంతోనే, భయంకరంగా గర్జిస్తూ, బయటికిపోయే మార్గం లేక గది తలుపులు బద్దలుకొట్టనారంభించాడు.

పులిగా మారిన శర్మను చూసి అతని భార్య హడలిపోయింది. ఆ భయంలో ఆమె రెండవ మంత్రం కాస్తా మరిచిపోయింది. తన చేతిలో అక్షింతలు

రెండు మూడు సారులు పులి మొహాన పడేట్టు చల్లింది. కాని, ఏమీ లాభం లేక పోయింది.

కొంతసేపటికి ఎలా అయితేనేం, పులి తలుపులు బద్దలుగొట్టి ఊరిపక్కన అడవి లోకి పారిపోయింది. పులి పారిపోయిన తరవాత శర్మ భార్యకు కొంచెం మనస్సు స్థిమితపడి, రెండవ మంత్రం జ్ఞాపకం వచ్చింది. కాని, ఏం లాభం!

తన తెలివితక్కువ పనికి ఆమె చాలా విచారించి, భర్తను గురించి బెంగపెట్టు కొన్నది. రెండు నెలలకు ఆమె తమ్ముడు అక్కడికి వచ్చాడు. వాణ్ణి వెంటబెట్టు కుని, ఆమె ధైర్యం చేసి, తన భర్తకోసం అడవిలో వెదకసాగింది.

ఇలా ఉండగా—ఆ రాజ్యంలో కొత్తగా ఒక మచ్చపులి వచ్చి పల్లెల మీద పడు తున్నదని రాజుగారితో ప్రజలు మొరపెట్టు కొన్నారు. అప్పుడు రాజుగారు వాళ్ళకు, అభయమిచ్చి పులిని చంపటానికని, పరి వారంతో సహా అడవికి బయలుదేరాడు. ఎంత వెతికినా ఆ మచ్చ పులి కనబడక పోవటంతో, విసిగి వేసారి రాజు ఒక చెట్టు నీడలో విశ్రాంతి తీసుకోబోయాడు.

అంతలోనే అయనకు వెనకనుంచి ఒక గర్జన వినబడింది. రాజు తలతిప్పి చూశాడు. అలా గర్జించింది మచ్చపులే! అది పంజా ఎత్తి రాజుగారి మీదికి దూకింది.

కాని, ఆయన ఆశ్చర్యపడేటట్టుగా, చూస్తూ వుండగానే ఆ పులి బ్రాహ్మడుగా



మారిపోయాడు. అతడే సోమశర్మ! ఒక చేయి ఎత్తిపట్టుకొని, రెండవ చేతితో రాజు గారి గొంతు నొక్కి పట్టుకొని వున్నాడు.

శర్మకు పులిగా మారిపోయిన క్షణం నుంచీ తను ఏమేంచేశాడో తెలియదు. అకస్మాత్తుగా అడవిలో అతనికి మానవ స్వరూపం వచ్చేసరికి, తను ఈ అడవికి అసలు ఎందుకు వచ్చాడో, రాజుగారిగొంతు ఎందుకునొక్కి పట్టివున్నాడో అర్థంకాలేదు.

శర్మ వణికిపోతూ రాజుగారి కాళ్లమీద పడి, క్షమించమని ప్రార్థించాడు. రాజుకు ఏమీ అర్థంకాలేదు.

ఆ సమయంలో, పక్కన వున్న చెట్టు మీదనుంచి ఒక స్త్రీ దిగివచ్చింది. ఆమె వనదేవత కాబోలు అనుకొన్నాడు రాజు.

పైగా, పులినుంచి తనను రక్షించింది ఆ దేవతే అని అనుకొని, వెంటనే ఆమెకు నమస్కరించాడు.

ఆమె వనదేవత కాదు. సోమశర్మ భార్య. రాజు తెల్లబోయి చూస్తూ వున్నాడు. ఆమె రాజుకు తన కథ అంతా చెప్పింది. పులిగామారినభర్తకోసంఅడవిలో తిరుగుతూవుంటే మచ్చపులి అక్కడకు రావటం సంభవించింది. వెంటనే ఆమె మంత్రం పఠిస్తూ గుర్తుపట్టి చెట్టు ఎక్కి కూర్చున్నది. రాజు పైన ఆ పులి పంజా ఎత్తగానే ఆమె అక్షింతలు చల్లి తన భర్తకు తిరుగా మామూలు స్వరూపం వచ్చేటట్లు చేసింది.

తనకు ప్రాణదానం చేసిన ఆమెను మెచ్చుకొని రాజు సోమశర్మకు తన ఆస్థానంలో గొప్ప ఉద్యోగం ఇచ్చాడు. అప్పటినుంచీ ఆ భార్యాభర్తలు సుఖంగా కాలక్షేపం చేస్తున్నారు.

వాళ్ల ఇద్దరికీ పులిమంత్రం సరదా తీరడమే కాకుండా, నాటినుంచీ వాళ్లవంశానికి 'మచ్చపులి వంశం' అని సార్థకమైన పేరు వాడుకలోకి వచ్చింది.

కొంతకాలానికల్లా సోమశర్మకు మంత్రం నేర్పిన సన్యాసి మళ్ళీ రావటం తటస్థించింది. ఆయన శర్మ సంగతి విని సంతోషించాడు.



## తాబేటి కన్నీళ్ళు



మరీ బరువుగా ఉండడం వల్ల పచ్చ తాబేళ్ళు నేలమీద నడవలేక నడుస్తూ వుంటాయి. అలా నడిచేప్పుడు కదలలేక బాధతో ఏడుస్తున్నట్టు వాటి కళ్ళ నుంచి ధారాపాతంగా నీళ్ళు కారుతూ వుంటాయి. నిజానికి, తాబేళ్లు సముద్రంలో వున్నప్పుడు శరీరంలో చేరిన ఉప్పు ఇలా కన్నీళ్ళ ద్వారా వెలుపలికి వస్తూ వుంటుంది।

## అపాయకరమైన చేప!

చేపలన్నిటిలోకీ పొడవాటి తోక గల 'టేకి' చేపలే మనిషికి ఎక్కువ గాయాలు కలిగిస్తాయి. ఎందుకంటే నీళ్ళు పలుచగా వున్న చోట ఈ చేపలు ఇసుకలో పూడుకుపోయి వుంటాయి. అప్పుడు పొరబాటున ఎవరైనా దాని మీద కాలు వేస్తే పొడవాటి కొండితో చటుక్కున కుట్టి, విషం ఎక్కిస్తుంది. దానివల్ల విపరీతమైన బాధ, ఒక్కొక్కసారి మరణం కూడా వాటిల్లుతుంది।



## ఈదలేనివి!

గొరిల్లాలకు ఈదడం చేతకాదు।



"నాతోపాటే నడవండి."



పిల్లలు పెరుగుతున్నారంటే వారితో
పాటు పెరుగుతవి వారి
పరుగులాటలు. అటువంటి
సమయంలో పిల్లలకు కావాలి
మన్నికైన, సుఖవంతమైన
పాదరక్షలు, పాదాలకు ఆరోగ్య
కరమైన పెరుగుదలనిచ్చే
పాదరక్షలు. అవే! బాటావారి
టిగ్రె స్కూల్ షూస్. దేశంలో
ప్రతి చెప్పుల దుకాణంలో
లభిస్తుంది.




SCHOOL SHOES

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1991 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



G. Srinivasamurthy



Anant Desai

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగాని కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జూలై నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/—లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:— చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: మీ అందరికీ స్వేచ్ఛ! రెండవ ఫోటో: నాకెందుకీ శిక్ష?

పంపినవారు: ఆర్. రాధాకుమారి, అభిరామపురం, మద్రాసు—600018.

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 48-00

చందా పంపవలసిన చిరునామా:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

రజతోత్సవ సంవత్సరంలో
25
విజయచిత్ర


1966

రజతోత్సవ సంవత్సరంలో
మీ అభిమాన పత్రిక!

# విజయచిత్ర

25 సంవత్సరాలుగా సినీ పరిశ్రమకీ-
సినిమా అభిమానులకీ మధ్య వారధిగా
వుంటూ, వన్నెతరగని నాణ్యతతో
వెలువడుతున్న
ఏకైక సినిమా పత్రిక

# విజయచిత్ర



1991

నాటినుండి నేటివరకు సినిమా అభిమానుల
ప్రియతమ పత్రిక!

# విజయచిత్ర

ఇది ఒక డాల్టన్ ప్రచురణ

# SUPER CHAMPS COLLECTION SCHEME





## FREE స్పోర్ట్స్‌స్టార్ స్టికర్లు








సూపర్ వినోదం !
సూపర్ ఆశ్చర్యాలు !
24 స్టికర్లు సేకరించండి.
బహుమతులు గెలవండి.
ఇవిగో చూడండి !

కొత్త 25 హాజ్మోలా కేండి "సూపర్‌ఛాంప్స్" ప్యాక్. మీకు చాలా ఇష్టమైన స్పోర్ట్స్‌స్టార్ స్టికర్లు అందులో ఉంటాయి. ఇమ్రాన్ ఖాన్, ఇవాన్ లెండల్, స్టెఫిగ్రాఫ్, ఇంకా అనేక మంది గొప్ప స్టార్లు మిమ్మల్ని కలుసుకునేందుకు ఆతృతతో ఉన్నారు. 5 స్టికర్లు సేకరించండి, అద్భుతమైన "సూపర్‌ఛాంప్స్" ఆల్బమ్ మీ సొంతం అవుతుంది. అంతే కాదు. మీకు ఉత్తేజకరమైన హాజ్మోలా కేండీ క్లబ్‌లో ఉచితంగా సభ్యత్వం లభిస్తుంది.

(ప్రతి "సూపర్‌ఛాంప్స్" ప్యాక్ లోపల వివరాలు లభిస్తాయి.)

త్వరపడండి ! మీ "సూపర్‌ఛాంప్స్" సేకరణ ఈ రోజే ప్రారంభించండి.

SURPRIZE
బహుమతులు - ఆల్బమ్ పూర్తి చేసిన మొదటి 1000 మందికి!

పుల్ల పుల్లటి తియ్యటి



Hajmola®
CANDY



